Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేలకు జారే దొకరైతే...

పంపినవారు :
వి. హనుమాయమ్మ - అమలాపురం

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు

★


రాజద్రోహం :
దేశద్రోహం ... 3
కంచుకోట
(సీరియల్-4) ... 9
భర్తనుగెలిచిన భార్య 17
కీలుగుర్రం-5 ... 27
దురాశాపరుడు ... 33
చేజిక్కిన శత్రువు ... 41
రూపధరుడి
యాత్రలు-16 ... 49
కాకోలూకీయం—
(గేయకథ) ... 57
ప్రకృతి వింతలు ... 61
వదలని చెప్పులు ... 66


ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



....పార్లేవారి గ్లూకో
బిస్కట్లు! కాని నేను వీటిని
ఎప్పుడూ మర్చిపోను....

# పార్లేవారి
# గ్లూకో
## బిస్కట్లు

Parle Gluco BISCUITS

విటమినులు
చేర్చబడినవి

పార్లే ప్రొడక్ట్స్ మాన్యుఫాక్చరింగ్
కంపెని ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి.

PG-58-2 TEL.

EVEREST



# మాజ్డ దీపములు

ఎక్కువ

కాలము

ప్రకాశవంతముగా

వెలుగును






AIC 195 TB

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

రఘునాథ్ ట్రేడింగ్
కార్పొరేషన్
మెయిన్ రోడ్డు - గుంటూరు.
ఒ. కె. ఎలెక్ట్రికల్స్
మెయిన్ రోడ్డు - కాకినాడ.

మాచ్‌కుండ్ ఎలెక్ట్రికల్
స్టోర్స్
బెసెంట్ రోడ్డు,
గవర్నరుపేట,
విజయవాడ - 2.

తియ్యటి బిడ్డలకు
తియ్యటి కానుక
జె. బి. స్వీట్స్
గ్లూకోస్‌తో తయారైనవి



కొత్త

టిన్నులు-అనేక ఆకృతులలో అందంగా ముద్రించి
బహుమతులుగా ఇవ్వటానికి అర్హమైనవి.



అందరకూ మంచివి
అందరకూ ప్రియమైనవి

**J. B. MANGHARAM & CO.,**
**GWALIOR, INDIA**

*makers of famous biscuits*

జె. బి. మంఘారామ్ అండ్ కో.,
గ్వాలియర్, ఇండియా
ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

రాజ్యాంగం ఎలాటిదైనప్పటికీ ప్రజాక్షేమం పరిపాలనా విధానాన్ని అనుసరించి ఉంటుంది. రాజులు పరిపాలించిన కాలంలోకూడా ప్రజాక్షేమంకోసం పాటుపడినవా రున్నారు. అయితే అటువంటి రాజులు తమ మంత్రి సామంతుల సానుభూతి సహకారాలు లేకుండా ప్రజలకు క్షేమం సాధించలేరు. రాజుల పరిపాలనలో రాజులకు మంత్రి సామంతుల సహకారం ఎంత అవసరమో, మంత్రి సామంతులకు రాజుయొక్క అండకూడా అంత అవసరమే. మంత్రిసామంతుల అండ లేని రాజుపై దేశద్రోహులు విజృంభిస్తారు. అరాజకం వస్తుంది; రాజు అండలేని సామంతులు దాన్ని అణచలేరు. ఈ సంగతి "రాజద్రోహం : దేశద్రోహం" అన్న కథ స్పష్టం చేస్తున్నది.

అదృష్టవశాత్తూ మనం ప్రజాస్వామిక యుగంలో ఉన్నాం. ఈ యుగంలో ప్రజామంత్రులకూ, ప్రజలకూ మధ్య సామరస్యం అవసరం. ఈ సామరస్యం లేనినాడు ప్రజలకూ, మంత్రులకూ కూడా హాని జరుగుతుంది.

ఈ సంచికలో మీరు చదివే "భర్తను గెలిచిన భార్య" షేక్స్పియర్ నాటక కథ.

సంపుటి 23 ★ అక్టోబర్ 1958 ★ సంచిక 4



## అట్టవిూదిబొమ్మ

కార్తీకమాసంలో ఒకనాటి ఉదయం కృష్ణుడు హస్తినాపురానికి పాండవుల రాయబారిగా బయలుదేరాడు. దారుకుడు సారథిగా గల కృష్ణుడి రథంలో అనేక ఆయుధాలు పెట్టుకుని కృష్ణ సాత్యకులు ఎక్కి కూచున్నారు. పాండవులూ తదితరులూ కృష్ణుణ్ణి కొంతదూరం సాగనంపారు.

మధ్యదారిలో కృష్ణుడు వృకస్థలంలో మజిలీ చేశాడు. ఈ సంగతి తెలిసి ధృతరాష్ట్రుడు, వృకస్థలంనుంచి హస్తినాపురానికి వచ్చే మార్గంలో కృష్ణుడికి సన్మానాలు చేయటానికి అనేక ఏర్పాట్లు చేశాడు. కాని కృష్ణుడు వాటి చాయలకు పోక నేరుగా హస్తినాపురానికి వచ్చేశాడు.

కృష్ణుడు హస్తినాపురానికి వస్తూనే ధృతరాష్ట్రుడి కొలువుకూటానికి వెళ్లాడు. అక్కడ ఆయన భీష్మద్రోణ కృపాశ్వత్థామలతోనూ ఇతరులతోనూ కులాసాగా కొంతసేపు ప్రసంగించి, ధృతరాష్ట్రుడివద్ద సెలవు తీసుకుని విదురుడి ఇంట బస చెయ్యటానికి వెళ్ళాడు. ఆ మధ్యాన్నం ఆయన కుంతీదేవిని చూడబోయాడు. కుంతీదేవి తన కొడుకులు పడ్డ శ్రమలన్నీ తలుచుకుని ఏడ్చింది. కృష్ణుడామెను ఊరడించి పాండవులకు మంచికాలం రాబోతున్నదని చెప్పాడు.

కుంతీదేవి ఇంటినుంచి కృష్ణుడు దుర్యోధనుడి సభాభవనానికి వెళ్ళాడు. దుర్యోధనుడు కృష్ణుడికి చేయవలసిన మర్యాదలన్నీ చేసి తనవెంట భోజనం చెయ్యమన్నాడు. కాని కృష్ణుడు ఒప్పుకోక, విదురుడి ఇంట భోజనం చేసి రాత్రికి అక్కడే పడుకున్నాడు.

మర్నాడు కృష్ణుడు లేచి కాలకృత్యాలు తీర్చుకుని కౌరవ సభకు వెళ్లాడు. సభలో పెద్దలందరూ ఉన్నారు. కృష్ణుడికి ఉచితాసనం ఇచ్చారు. అందరూ వింటూండగా ఆయన ధృతరాష్ట్రుడితో తన రాయబారం చెప్పాడు: "ఇప్పటికే నీవు గొప్ప చక్రవర్తివి. పాండవులతో పొత్తు చేసుకుని వారినికూడా నీ బలగంలో చేర్చుకుంటే నీకేసి దేవతలుకూడా తేరిపారచూడలేరు. అలాకాక యుద్ధం జరిగితే ఇక్కడ వున్న రాజులందరూ మరణిస్తారు," అన్నాడు కృష్ణుడు.

ధృతరాష్ట్రుడూ, భీష్ముడూకూడా దుర్యోధనుడికి హితం చెప్పారు. అంతా విని దుర్యోధనుడు, "నేనా పాండవులకు సూదిమొన మోపినంత భూమికూడా ఇవ్వను!" అని చెప్పి, శకుని కర్ణ దుశ్శాసనులతో సభనుంచి వెళ్లిపోయాడు.



# రాజద్రోహం: దేశద్రోహం

ఒకప్పుడు భూపాలదేశానికి విజయాదిత్యుడు రాజయాడు. ఆయన సింహాసనానికి వస్తూనే ప్రజాక్షేమం గురించి శ్రద్ధగా విచారించాడు. తన దేశంలో గల శ్రీమంతులూ, సామంతులూ, బలవంతులూ నిరంకుశంగా ప్రజలను పీడించి దోచుకోవటం ఆయన గమనించాడు. ఈ గొప్పవాళ్ళ మూలంగా పొలాలు దున్నుకునే వారూ, పశువులను పోషించుకునేవారూ ఎంతో అన్యాయానికి గురి అవుతున్నారు.

ఈ దురన్యాయాన్ని అరికట్టాలని నిశ్చయించుకున్నవాడై విజయాదిత్య మహారాజు కొన్ని శాసనాలు చేశాడు. వాటి మూలంగా ప్రజాసామాన్యానికి అనేక రక్షణలు ఏర్పడ్డాయి, బలవంతులా, నిరంకుశులా ఆట కట్టయింది.

రాజుగారు చేసిన ఈపని రాజుగారి కొలువులో ఉండే పెద్దలలోనే కొందరికి నచ్చలేదు. అలాటివారిలో ఒక మంత్రీ, సేనాపతీకూడా ఉన్నారు. వీరు బహిరంగంగా రాజుగారికి ఎదురు చెప్పలేక రహస్యంగా కుట్ర ఆరంభించారు.

కుట్రదార్ల సంఖ్య ఇరవైదాకా ఉన్నది. అందరూ గొప్ప పదవులు గలవాళ్ళే. వారి అండ లేకపోతే రాజు ఒక్క క్షణంకూడా పరిపాలించలేడు. రాజుగారిని సింహాసనంపై ఉంచటమూ, దించటమూ కూడా వారి చేతిలో ఉన్నాయి.

మంత్రీ, సేనాపతీ కుట్రదార్లకు నాయకులు. మంత్రి రహస్యంగా ఒక్కొక్క కుట్రదారునే ఇంటికి పిలిచి, "రాజు మన వర్గానికి ద్రోహం చెయ్యటంతో దేశానికే ద్రోహం చేశాడు. సామాన్య ప్రజలకు కావలిసింది న్యాయం కాదు, మనవంటివాళ్ళ ఆదరం. శ్రమపడి సంపాదించినదానితో ప్రజలు ఏనాడూ సుఖపడరు, తృప్తిపడరు.

పి. నంజీవరావు





మంత్రి చెప్పిన మాటలతో మిగిలిన కుట్రదార్లంతా ఏకీభవించారు. అందరూ ఒకచోట కూడి కర్తవ్యం నిర్ణయించవలసిన సమయం వచ్చింది.

"ఇది చాలా రహస్యంగా జరగవలసిన సమావేశం. మనం చేసే నిర్ణయం రాజుకు తెలిసేలోపుగా అమలు జరిగిపోవాలి. అరణ్యం మధ్య నాకొక కుటీరం ఉన్నది. వేటకు వెళ్ళినప్పుడు నేను అందులో బస చేస్తాను. అందులో మనం సమావేశమై ముందుకర్తవ్యం ఏమిటో నిర్ణయించుదాం," అన్నాడొక సామంతు.

వాళ్లకి రాజు ఎంత న్యాయం చేసినా వారి దరిద్రం తీరదు. వాళ్లకు సంతోషం కలిగించేదల్లా మనవంటివాళ్ల ఆదరమే. మనం అనుగ్రహించి చేతిలో ఒక మాడ పెడితే వాళ్ళు ఎంతో సంతోషిస్తారు. ఎందుకంటే మనం ఇచ్చేది వాళ్ళు శ్రమపడకుండా సంపాదించినది. మనం శ్రమపడకుండా డబ్బుతో తులతూగుతున్నాం గనకనే వాళ్లు మన అడుగులకు మడుగులొత్తుతారు. ఇప్పుడు రాజుచేసిన పని ఏమిటి? ప్రజలకూ, మనకూ కూడా నష్టం వచ్చేలాగా శాసనం చేశాడు. దీన్ని మనం సహించరాదు!" అని బోధించాడు.

ఒకరోజు సాయంకాలం సూర్యాస్తమయం వేళకు కుట్రదార్లు ఆ కుటీరం వద్దకు ఎవరికి వారుగా వచ్చి కలుసుకోవటానికి ఏర్పాటయింది. కుట్రదార్లు సమావేశమయే సమయానికే తుఫానుకూడా ఆరంభమయింది. అందుచేత ఆ అడవి మార్గంగా ఎవరన్నా వచ్చేభయంగాని, కుట్రదార్ల చర్చలకు భంగం కలిగే భయంగాని లేకుండాపోయింది.

అందరూ కుటీరంలో చేరి తలుపు బిగించి చర్చలు ప్రారంభించారు.

"చర్చించటాని కేమున్నది? రాజును చంపేసి మన హక్కులను కాపాడేవాణ్ణి



రాజుగా చెయ్యటమే మనకర్తవ్యం," అన్నాడు సేనాపతి.

మంత్రి రాజహత్యకు అభ్యంతరం చెప్పాడు. "మనం రాజును పదభ్రష్టుణ్ణి చెయ్యటం వరకు నేను ఒప్పుకుంటాను. ఆయనను చంపటం నాకు సమ్మతం కాదు. వ్యక్తిగా ఆయనతో మనకు తగాదా లేదు," అన్నాడు మంత్రి.

"పదభ్రష్టుడైనా రాజు రాజే. రాజు ఎంత అసమర్థుడైనా ప్రజలలో రాజభక్తి ఉండనే ఉంటుంది. రాజు బతికిఉండటం మనకు ఎప్పటికైనా ప్రమాదమే. అదీగాక ఇరుగుపొరుగు రాజులు ఆయనను చేరదీసి సహాయం చెయ్యవచ్చు. శత్రుశేషం ఎన్నడూ ఉంచరాదు," అన్నాడు సేనాపతి.

కొందరు కుట్రదార్లు సేనాపతినీ, మరి కొందరు మంత్రినీ బలపరిచారు. చివరకు సామంతు, "వాదప్రతివాదాలు మన ఐక్యతకు భగం కలిగిస్తాయి. పాచికలు తీసి మంత్రీ సేనాపతీ పందెం వెయ్యాలని నేను సూచిస్తున్నాను. పందెంలో మంత్రి గెలిస్తే రాజు చావడు, సేనాపతి గెలిస్తే రాజు చచ్చి తీరుతాడు!" అన్నాడు.

ఈ సూచనను అందరూ ఆమోదించారు. మంత్రికి పాచికల ఆటంటే చాలా ఇష్టం.



ఆయన వెంట ఎప్పుడూ పాచికలుంటాయి. ఆయన వాటిని తీసి గలబరించి పందెం వెయ్యబోతూండగా కుటీరం తలుపుమీద ఎవరో గట్టిగా కొట్టి, "తలుపు! తలుపు!" అని కేకపెట్టారు.

కుట్రదార్లు స్తంభించిపోయారు. తమ రహస్యం బయటపడి ఉండాలి. లేకపోతే ఆ తుఫానులో అరణ్యం మధ్య వున్న కుటీరానికి, ఆ సమయానికి ఎవరు వస్తారు? ఎందుకు వస్తారు?

"వానకు తడిసి ముద్ద అయిపోయాను. నన్ను కాస్త లోపలికి రానివ్వండి," అని బయటి మనిషి మళ్ళీ అన్నాడు.



"తలుపు తెరవండి. ఇరవైమందిమి ఉన్నాం! ఒక్క మనిషి మనని ఏం చేస్తాడు?" అని సేనాపతి అన్నాక ఎవరో వెళ్లి తలుపు తెరిచారు. మరుక్షణం విజయాదిత్య మహారాజు తడిసి ముద్దఅయిన బట్టలతో వణుకుతూ లోపల ప్రవేశించి తలుపు గడియపెట్టాడు.

"పెద్దలంతా ఒకచోట చేరారే! జూదం ఆడుతున్నట్టున్నారు. పెద్ద పందాలమీద ఆడటం లేదుగద!" అన్నాడు రాజు ఛలోక్తిగా. అందరి గుండెలూ గుబగుబలాడాయి. ఒక్క సేనాపతిమాత్రం ధైర్యంగా, "పెద్ద పందెమే, మహారాజా. మీ ప్రాణాలు



పణంగా పెట్టి నేనూ, మంత్రీ ఆడబోతున్నాం!" అన్నాడు.

రాజు ముఖంలో కోపంగాని, భయంగాని కనిపించలేదు.

"ఆ పందెం ఇప్పుడు చెల్లదు. మీ అందరి ప్రాణాలూ నా చేతిలో ఉన్నాయి. ఈ కుటీరం చుట్టూ సాయుధ భటులున్నారు. రాజద్రోహం తలపెట్టిన మీలో ఎవడో ఒకడు అనుచరద్రోహి ఉన్నాడు. మీ రహస్యం అదివరకే బయటపడిపోయింది. అయినా మీరు పాచికలు ఆడటానికి నా అభ్యంతరం లేదు. కాని నేను చెప్పిన విధంగా ఆడండి. ఇద్దరిద్దరేసి చొప్పున పందెం వెయ్యండి. పందెంలో ఓడినవాణ్ణి గెలిచినవాడు చంపేటట్టు. అలా అడి మీ ఇరవైమందిలో పదిమంది ప్రాణాలు దక్కించుకుంటారా? లేక అందరూ కలిసి కట్టుగా ప్రాణాలు పోగొట్టుకుంటారా? మీ యిష్టం!" అన్నాడు రాజు.

"మీరు చెప్పినట్టే చేస్తాం!" అన్నారందరూ. కుట్ర బయటపడిపోయిందని తెలియగానే బతికి బయటపడాలన్న ఆశ అందరినీ పట్టుకుంది.

మొదటగా మంత్రీ సేనాపతీ పందెం వేశారు. పందెంలో సేనాపతి ఓడిపోయాడు.







"నేను చావటానికి ఒప్పుకోను! చంపి మరీ చస్తాను!" అంటూ సేనాపతి కత్తి దూశాడు. కాని మిగిలినవారంతా అతన్ని పట్టుకుని నిరాయుధుణ్ణి చేసి పెడరెక్కలు విరిచి కట్టి ఒక పక్కగా నిలబెట్టారు.

కొద్దిసేపట్లోనే అందరూ పాచికలతో పందాలు వేశారు. ఓడిపోయిన పదిమందినీ పెడరెక్కలు విరిచి కట్టి గోడవెంబడి నిలబెట్టారు. సేనాపతి చావు భయంతో వణికిపోతున్నాడు.

మంత్రి రాజుతో, "మహారాజా, నాకోరిక మన్నించి ఈ సేనాపతి బదులు నన్ను చావనివ్వండి. ఇతనికి చావంటే చాలా భయంగా ఉన్నది!" అన్నాడు.

రాజు మంత్రికేసి చాలాసేపు చూసి, "మీరంతా నాపట్ల ద్రోహం తలపెట్టినప్పటికీ మీలో ఇంకా ఔదార్యం ఉన్నది. ఇలాటి ద్రోహం ఎందుకు తలపెట్టారు?" అని అడిగాడు.

"దేశక్షేమం కోరి తలపెట్టాం. మీరు మా వర్గానికి అన్యాయం చేసి దేశానికి అన్యాయం చేశారు. మా క్షేమమే దేశక్షేమం!" అన్నాడు మంత్రి నిర్భయంగా.

"మీరు మూర్ఖులు. రాజక్షేమమే దేశక్షేమం. రాజద్రోహం తలపెట్టి మీరు దేశద్రోహం చేశారు. నేను చెప్పినట్టు మీలో ఎవరో అనుచరద్రోహి ఉన్నాడు. మీరు చేసే కుట్ర ప్రజలకు తెలిసిపోయింది. కొందరు దుర్మార్గులు నా పతనం గ్రహించి, నాపైకి ప్రజలను ఉసికొల్పారు. నా స్థానమూ, మీ స్థానమూకూడా ఆ దుర్మార్గులు తీసుకున్నారు. వారిచేత రెచ్చగొట్టబడిన ప్రజలు నగరానికి నిప్పు పెట్టారు. నగరపు వీధులలో రెండు కక్షలుగా చీలి ప్రజలు పొడుచుకుంటున్నారు. ఆ భీభత్సంలోనుంచి తప్పించుకుని నేను ప్రాణాలతో బయటపడి పారిపోయి ఇటుగా వచ్చాను. నావెంట సాయుధభటులు లేరు. నాకు మీరిక్కడ



కుట్ర చేస్తున్న సంగతికూడా తెలియదు. నేనిక్కడికి రావటం కేవలం దైవికం. నన్ను మీరు చంపినా, ప్రాణాలతో వదిలినాకూడా మీరు నగరానికి వెళ్లి ప్రజలను మీవేపు తిప్పుకోలేరు. నేను నా దారిన పోతున్నాను!" అన్నాడు రాజు.

రాజు యిలాఅనేసరికి అందరూ భయపడ్డారు. "మహారాజా, ఆగండి! మనం నగరానికి తిరిగి వెళ్లి శాంతిని నెలకొల్పుదాం పదండి!" అన్నాడు మంత్రి.

"నేను రాను. ఇంతకాలానికి నాకొక పెద్ద బరువు దిగిపోయింది. మీరే వెళ్లి శాంతిని నెలకొల్పుకోండి. అది చేతకాక పోతే ప్రజల ఆగ్రహంలో భస్మమైపొండి!" అన్నాడు రాజు.

కుట్రదార్లందరూ రాజు కాళ్లపై పడి వెళ్ల వద్దని బతిమాలుకున్నారు. "మహారాజా, మీరూ మేమూ కలిసి వెళ్లితేనేగాని ప్రజలు శాంతించరు! దేశక్షేమంకోసమైనా మీరు మావెంట నగరానికి రండి!" అని మంత్రి ప్రాధేయపడ్డాడు. రాజు సమ్మతించాడు. ఆయన మంత్రినీ, సేనానాయకుణ్ణీ, యితర వుద్యోగులనూ వెంటబెట్టుకుని, ఆ తుఫానులోనే నగరానికి బయలుదేరాడు. దారిలో ఎవరూ వారిని అటకాయించలేదు.

రాజు ఈ విధంగా కుట్రదారులతో నగరం ప్రవేశించగానే ప్రజల ఉన్మాదం ఒక్కసారిగా దిగిపోయింది. రాజుగారిపై కుట్రజరిగిన మాట అబద్ధమని తేలిపోయింది. తమను రెచ్చగొట్టిన నాయకులపై ప్రజలు పగ తీర్చుకున్నారు. తిరిగి భూపాలనగరంలో శాంతి ఏర్పడింది.

మళ్లీ రాజుగారిపై కుట్రదార్లు ఎన్నడూ కుట్ర చెయ్యలేదు. ఆయన కుట్రదారులను దండించనూ లేదు. ఆయన చేసిన శాసనాలు అమలు జరగటంచేత పేదప్రజలు గొప్పవాళ్ల భయం పోగొట్టుకుని సుఖంగా జీవించారు.






## 4

[సుబాహుడు బిచ్చగాడులా నటించి సర్పకేతుడి సైనికుల బారిపడకుండా తప్పించుకున్నాడు. తరవాత అతను వీరపురం దోచుకో బయలుదేరినవారితో కలిసి వీరపురం చేరాడు. సర్పకేతుడి సైనికులు మాయోపాయం ప్రయోగించి. వీరపుర పట్టణ ద్వారాలు తెరుచుకుని, పట్టణంలో ప్రవేశించారు. రానున్న ప్రమాదాన్నిగురించి, తన యజమాని చంద్రవర్మతో చెప్పేందుకు, సుబాహుడు రాజప్రాసాదం కేసి పరిగెత్తసాగాడు. అది గమనించిన సర్పకేతుడి సైనికులు కొందరు అతడి వెంటబడ్డారు. తరవాత—]

సుబాహుడు తను తాత్కాలికంగా ప్రమాదాన్నుంచి బయటపడినా, తనను వెన్నాడి కొందరు సైనికులు వస్తున్నట్టు, వాళ్ల అడుగుల చప్పుడునుబట్టి గుర్తించాడు. అగి వెనుదిరిగి చూచేందుకూడా అవకాశం లేదు. తను, ఎంత త్వరగా పరిగెత్తి రాజప్రాసాదంలో జొరబడగలుగుతానా అన్నదానిమీదే అతడి మనస్సు కేంద్రీకరింపబడి వున్నది.

వెనక కేకలూ, చప్పట్లూ మరింత దగ్గిర అవుతున్నవి. అంతలో సుబాహుడు రాజప్రాసాదం ముందున్న జలయంత్రంచాటుగా ముందుకు పరిగెత్తి, ప్రాసాదద్వారం ముందు కాపలావున్న భటులను వుద్దేశించి, "నేను సుబాహుణ్ణి దారి యివ్వండి! నన్ను తరుముకువస్తున్నవాళ్లు సర్పకేతుడి సైనికులు. వాళ్లను అడ్డగించండి. మన భటుల కందరికీ హెచ్చరిక యివ్వండి," అంటూ



కాపలాభటులు దారి యివ్వగా చెంగున ప్రాసాదంలో ప్రవేశించాడు.

ఈలోపల కాపలాభటులు కత్తులు దూసి, తమను సమీపిస్తున్న సర్పకేతుడి సైనికులను ఎదుర్కొన్నారు

సుబాహుడు, చంద్రవర్మ వుండే మేడ పై భాగానికి మెట్లమీదుగా పరిగెత్తుతూ ఎలుగెత్తి, "యువరాజా, ఘోరప్రమాదం! సర్పకేతుడి సైనికులు పట్టణంలో జొరబడ్డారు," అంటూ అరవసాగాడు.

సుబాహుడి కేకలకు, నిదురిస్తున్న చంద్రవర్మ వులిక్కిపడి లేచి హడావిడిగా పడకగదినుంచి బయటికి వచ్చాడు. అతడికి

ప్రాసాదం ముందు గల రాజమార్గంమీద పెద్ద కలకలం వినబడింది. అతడు ఆశ్చర్యపడుతూ మిద్దెమీదికి పరిగెత్తి పిట్టగోడ నానుకుని ఆ కలకలం వచ్చిన వైపుకు చూచేంతలో, సుబాహుడు రొప్పుతూ అక్కడికి వచ్చాడు.

"యువరాజా! సర్పకేతుడి సైనికులు మోసంచేసి పట్టణ ద్వారాలు తెరుచుకుని లోపల ప్రవేశించారు. మన భటులను హెచ్చరించండి. శత్రుసైనికులు చాలామంది ఈసరికే ప్రాసాద ప్రాంగణంలో ప్రవేశించి వుండవచ్చు," అన్నాడు.

చంద్రవర్మ ఒక్క తృటికాలం నిశ్చేష్టుడయ్యాడు. అంతలో రాజమార్గానికి యిరువైపులా వున్న గృహాలనుంచి పెద్ద పెద్ద మంటలు లేచినై. గుర్రాల సకిలింపులూ, సైనికుల కేకలూ, గృహస్థుల ఆర్తనాదాలూ చూస్తూండగానే మిన్నుముట్టినై.

చంద్రవర్మ, సుబాహుడికేసి తిరిగి, "మా తండ్రిగారెక్కడ? అయన వెంట నువు యశోవర్ధనమహారాజుగారివద్దకు వెళ్లావు గదా?" అని అడిగాడు.

సుబాహుడు ఆ ప్రశ్న వింటూనే వెలవెలపోయాడు. అతడు ఎంత ప్రయత్నించినా నోటమాట రాలేదు. ఇప్పటి విపత్కర పరి



స్థితుల్లో, సూర్యవర్మ దుర్మరణం సంగతి చెప్పటం ఏమీ మంచిది కాదని అతడికి మెరుపులా తోచింది. ముందు, ద్రోహబుద్ధితో పట్టణం ప్రవేశించిన సర్పకేతుడి అనుచరులను సర్వనాశనం చేయాలి. ఆ తరవాత అవకాశం కలగగానే అన్ని విషయాలూ సాకల్యంగా మాట్లాడుకోవచ్చును.

"యువరాజా! తమ తండ్రిగారు వీరపుర మార్గంలో వున్నారు. ప్రస్తుత కర్తవ్యం గురించి ఆలోచించండి. ఇప్పటికే సర్పకేతుడి సైనికులు పట్టణానికి నిప్పంటించుతున్నారు. ఏ నిమిషంలో అయినా, వాళ్లు రాజప్రాసాదం ప్రవేశించవచ్చును," అన్నాడు సుబాహుడు, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

అంతలో మిద్దెపైకి వచ్చే మెట్లమీద కలకలం బయలుదేరింది. వాళ్లు శత్రు సైనికులు కావచ్చునన్న అనుమానం కలిగింది సుబాహుడికి. అతడు ఒక్క గంతులో చంద్రవర్మ పడకగదిలో జొరబడి, అక్కడ గోడకు వేలాడుతున్న కత్తులు రెండు తీసుకుని, బయటికి వచ్చి వాటిల్లో ఒకదానిని చంద్రవర్మకు యిచ్చాడు.

మెట్లమీదినుంచి, "యువరాజా, యువరాజా!" అన్న కేకలు వినిపించినై. ఆ



కంఠస్వరం గుర్తించిన చంద్రవర్మ, "ఎవరు? సేనానీ!" అంటూ బదులు కేకవేశాడు.

వీరపుర సేనాని ధీరమల్లుడు ఆ కేక వింటూనే సూటిగా చంద్రవర్మ వున్న చోటుకు పరిగెత్తుకు వచ్చాడు.

"యువరాజా! ప్రమాదం ముంచుకు వస్తున్నది. యశోవర్ధన మహారాజు మన మీద ఎందుకు కత్తికట్టారో, నాకు తెలియటం లేదు. ఆయన పంపగా వచ్చిన సైనికులు పట్టణంమీద పడి, కనబడిన గృహానికల్లా నిప్పుపెడుతూ, దోచుకుంటున్నారు. కొందరు పట్టణప్రజలుకూడా, ఆ సైనికులతో కలిశారు," అన్నాడు ధీరమల్లుడు.



పల్లెవాసులు. డబ్బుదొరుకుతుందని ఆశ చూపి, యిక్కడికితెచ్చారు," అన్నాడు.

ఈ జవాబు వింటూనే సేనాని ధీర మల్లుడు నిశ్చేష్టుడయాడు. తరవాత అతడు చంద్రవర్మకేసి తిరిగి, "సుబాహుడు చెప్పేదే నిజంలా తోస్తున్నది. సర్పకేతుడు యిలాంటి కుటిల పద్ధతులు అవలంబించటంలో అందెవేసిన చేయి. మాహిష్మతీనగరం వెళ్లిన మహారాజులకుకూడా అతడివల్ల ఏదైనా అపాయం కలగవచ్చు," అన్నాడు ధీరమల్లుడు.

"ముందు మనం చిక్కుకున్న అపాయం సంగతి ఆలోచించండి, సేనానీ! మన భటులనందరినీ సమాయత్తపరిచి శత్రువులను పట్టణంనుంచి బయటికి తరిమే మార్గం ఏదో యోచించండి," అంటూ సుబాహుడు చంద్రవర్మకేసి చూశాడు.

చంద్రవర్మ, సుబాహుడు చెప్పినదానికి అవునన్నట్టుగా తల వూపి, "సేనానీ, రాజప్రాసాదరక్షణ సంగతేమిటి? దీని రక్షణకు ఎలాంటి ఏర్పాటులు చేశావు?" అని అడిగాడు ఆదుర్దాగా.

"యశోవర్ధన మహారాజుకూ, జై అంటూ కొందరు సాయుధులు కావలివాళ్లను తప్పుకుని భవనప్రాంగణంలో ప్రవేశించారు.

యశోవర్ధన మహారాజు పంపగా వచ్చిన సైనికులన్నమాట వింటూనే చంద్రవర్మ నిలువెల్లా వణికి, "సేనానీ...." అని ఏమో చెప్పబోయేంతలో, సుబాహుడు అందుకుని, "యువరాజా! ఆ సైనికులు యశోవర్ధన మహారాజు పంపగా వచ్చినవాళ్లు కాదు. మన పట్టణంలో ప్రవేశించేందుకూ, తరవాత మనలను మోసగించేందుకూ సర్పకేతుడు పన్నిన కుయుక్తి అది. నేను మారువేషంలో వాళ్లతోపాటు పట్టణంలో ప్రవేశించాను. పౌరదుస్తుల్లో వుండి, సైనికులకు సహాయం చేస్తున్నవాళ్లు మన పట్టణవాసులు కారు, వాళ్లంతా సంస్థాన ఎల్లల్లో వుండే



కాని, ఆ వెంటనే మన భటులు వాళ్లను ఎదుర్కొని హతమార్చటం జరిగింది. ఆ వచ్చినవాళ్లు సర్పకేతుడి సైనికులని మన వాళ్లకు ముందుగానే సుబాహుడు హెచ్చరిక యివ్వటం చాలా లాభించింది," అన్నాడు ధీరమల్లుడు.

"అయితే, మన భటులనందరినీ ఆయత్తపరుచు. కొద్దిమంది భటులను యిక్కడ కాపలావుంచితే సరిపోతుంది. తక్కినవారితో పట్టణం ప్రవేశించి, ఆ సర్పకేతుడి సైనికులను వేటాడదాం," అన్నాడు చంద్రవర్మ.



"భటులందరూ ఆయత్తపరచబడ్డారు, యువరాజా! యశోవర్ధన మహారాజు పేర కొట్టే జేజేలు నన్ను కలవరపరిచినై. అందుకే మీదగ్గిరకు వచ్చాను," అన్నాడు ధీరమల్లుడు.

ఆ సరికి పట్టణంలో అనేకచోట్ల పెద్ద పెద్ద మంటలు లేచినై. ఒక్క రాజమార్గం వైపునుంచే కాక, అన్ని వైపులనుంచీ కేకలూ, ఆర్తనాదాలు వినబడుతున్నవి. చంద్రవర్మ మిద్దెపైనుంచి కాలిపోతున్న పట్టణంకేసి ఓసారి సాలోచనగా చూసి పెద్దగా నిట్టూరుస్తూ, మెట్లు దిగి భవనంముందుకు వచ్చేశాడు. అక్కడ ఆయుధధారులైన భటులు—నాలుగైదు వందలమంది సోలుపులుగా నిలబడి వున్నారు. వారి పక్కనే అశ్వారూఢులైన కొందరు రౌతులు పెద్దపెద్ద యీటెలు చేబూని సర్వసన్నద్ధంగా వున్నారు.

చంద్రవర్మ ఓ యాభైమంది భటులనూ, పదిమంది అశ్వికులనూ రాజప్రాసాదరక్షణకు నియోగించి, మిగతావారిని రెండు సమభాగాలుగా విభజించి, ఒక భాగాన్ని సేనాని ధీరమల్లుడికి ఒప్పచెపుతూ, "సేనానీ, నేను కోటద్వారాలు దాటి రాజమార్గం మీదికి వెళ్ళగానే తూర్పుదిక్కుకు తిరుగుతాను. నువ్వు నీ భటులతో పడమటి దిక్కుకు వెళ్ళటం మంచిది. ఇద్దరం ఆ




విధంగా శత్రుసైన్యాన్ని ఛేదించుకుంటూ, అర్ధచంద్రాకారంగా తిరిగి, ఉత్తరద్వారాన్ని చేరుకుందాం. ఒకవేళ...దైవనిర్ణయం మరోవిధంగా వుంటే, అప్పటి పరిస్థితులకు అనుగుణంగా వుండే నిర్ణయాలు ఎవరికి వారంగా చేసుకోవటం తప్ప మరోమార్గం లేదు," అన్నాడు.

"చిత్తం, యువరాజా! మీరుమాత్రం అనవసర ప్రమాదాలకు లోనుకాకండి. ఈ చీకటిమాటున శత్రువుల బలం తెలియటంలేదు," అన్నాడు ధీరమల్లుడు.

ఆ వెంటనే రెండుసైన్య విభాగాలూ, 'సూర్యవర్మమహారాజుకూ, జై!' అంటూ



ప్రాసాదప్రాంగణం దాటి పట్టణంలోకి ప్రవేశించినై. అప్పటికి తూర్పుదిక్కు తెలతెల వారుతున్నది. సాయుధుడై గుర్రంమీద వున్న సుబాహుడు, చంద్రవర్మకు ఆ దాపులనే తగలబడుతున్న గృహాలను చూపిస్తూ, "యువరాజా! సర్పకేతుడు తన కుటిల యత్నంలో కొంతవరకు విజయం సాధించాడు. అతడి పక్షాన పట్టణంలో ప్రవేశించినవారిలో సుశిక్షితులైన సైనికులు బహు కొద్దిమంది, ఎక్కువ భాగం దోపిడీ కోసం వచ్చిన పల్లెవాసులు. మనం నిర్దయగా వాళ్ళల్లో కొందరినైనా హతమార్చగలిగితే, తతిమ్మావాళ్ళు ప్రాణాలు అరచేతబట్టుకుని నగరం వదిలి పారిపోతారు. అలా చేద్దామంటారా?" అన్నాడు.

చంద్రవర్మకు యీ ఆలోచన బాగానే వున్నట్టు తోచింది. అతడు తన వెంటవున్న అశ్వికులను హెచ్చరించి, పెద్దగా జైజై నినాదాలు చేస్తూ, కాగడాలు పట్టుకుని యిటూ అటూ పరిగెత్తుతున్న దోపిడీదారుల మీదికి వురికాడు. మరుక్షణంలో అశ్వికుల చేత గల ఈటెలు దోపిడీదార్ల వెన్నుల్లోనూ, గుండెల్లోనూ బలంగా గుచ్చుకున్నై. ఆ వెంటనే, 'సూర్యవర్మ సైనికులు, సూర్యవర్మ సైనికులు!' అంటూ ఆ ప్రాంతమంతా





గగ్గోలు బయలుదేరింది. మరుక్షణమే రాజ మార్గంప్రక్కల అటూయిటూ వున్న సందు గొందులనుంచి, 'సూర్యవర్మ సైనికులా? ఎక్కడ? ఎక్కడ?' అన్న కేకలతోపాటు పరిగెత్తివస్తూన్న గుర్రాల గిట్టల చప్పుడు కూడా వినబడింది.

శత్రుసైనికులను హతమార్చేందుకు చంద్రవర్మకు అది మంచి అదనుగా కన బడింది. అతడు తన భటులలో సగం మందిని, శత్రుసైనికులు వస్తున్న గొందికి అటువైపుగా నిలబెట్టి, తక్కిన సగంమందితో రెండవవైపున నిలబడ్డాడు. రాజమార్గం చేరేందుకు ముందువెనుకలు చూడకుండా వస్తున్న శత్రు అశ్వికులను, వచ్చినవారిని వచ్చినట్టు యిరువైపులనుంచీ ఎదుర్కొని తెగటార్చాలని చంద్రవర్మ వ్యూహం.

అతడి వ్యూహం పారింది. మితిమీరిన విజయోత్సాహంలో సర్పకేతుడి సైనికులు రాజమార్గంమీద ఏమున్నదో చూసుకో కుండా, గొందిలోనుంచి వేగంగా రాజ మార్గం చేరేందుకు ప్రయత్నించారు. ఇరు వైపులా సర్వసన్నద్ధంగా వున్న చంద్రవర్మ భటులు వచ్చినవారిని వచ్చినట్టు తమ ఈటెలతో పొడవసాగారు. అక్కడ జరుగు తున్న భీభత్సాన్ని గుర్తించి, వెనుదిరిగి పారిపోయే లోపలే, శత్రువులలో ఎక్కువ భాగం చంద్రవర్మ భటులచేత నిర్దయగా హతమార్చబడ్డారు.

ఈ విజయంతో చంద్రవర్మ భటులలో ఎక్కడలేని ఆత్మవిశ్వాసం కలిగింది. వాళ్లు ఒక్కుమ్మడిగా, 'సూర్యవర్మ మహా రాజుకూ, జై' అంటూ రాజమార్గంమీద కనబడిన ప్రతి శత్రుసైనికుణ్ణీ, బంది పోటునూ వెంటాడి తమ ఈటెలతో, కత్తు లతో పొడవసాగారు. పట్టణప్రజలుకూడా, తమ యువరాజు భటులతో రావటం గుర్తించి, దొరికిన ఆయుధమల్లా చేబూని, శత్రువులమీద విరుచుకుబడ్డారు.





కొద్దిసేపట్లో చంద్రవర్మ ఎదురుపడిన శత్రువులనెల్లా హతమారుస్తూ ఉత్తరద్వారం సమీపించాడు. పడమటివైపుగా శత్రు సంహారానికి బయలుదేరిన సేనాని ధీరమల్లుడు కూడా అల్లంత దూరంలో కనిపించాడు. కానీ, అతని వెనుకభాగాన పెద్ద అశ్విక దళం ఒకటి కదులుతూండటం చంద్రవర్మ కంటబడింది.

చూస్తూండగానే ధీరమల్లుడు తన అశ్వికులతో చంద్రవర్మను సమీపించి, "యువరాజా! మనం వెంటనే రాజప్రాసాదదుర్గం చేరటం మంచిది. సర్పకేతుడు స్వయంగా మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడు. అసంఖ్యాకులైన ఆ శత్రుసైనికులతో స్వల్ప సంఖ్యలో వున్న మనం ముఖాముఖిని తలపడటం ఆత్మహత్యతో సమానమవుతుంది! దుర్గరక్షణల ఆసరాతో పోరాడదాం. ఈ లోపల సరిహద్దులలోవున్న మనసైన్యం సహాయంరావచ్చు," అన్నాడు.

సర్పకేతుడు మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడనే వార్త చంద్రవర్మకు పిడుగుపాటులా తోచింది. దీని అర్థం, అతడు మాయోపాయాన్ని పరిత్యజించి, ప్రత్యక్షంగా దండోపాయానికి పూనుకున్నాడన్నమాట!

చంద్రవర్మ తన అశ్వాన్ని గిరుక్కున వెనక్కు తిప్పాడు. సుబాహుడూ, ధీరమల్లుడూ, తమ తమ గుర్రాలను అతడికి యిరువైపులా నడిపారు. భటులు వెంటరా అందరూ అతివేగంగా ప్రాసాదంకేసి బయలుదేరారు. దారిలో ఎక్కడా వారిని శత్రువులు ఎదుర్కోలేదు. కాని, వారందరూ ప్రాసాద ప్రాంతాన్ని సమీపించేసరికి, దాని ముఖద్వారంముందు శత్రుపదాతి సైనికులూ, ఆశ్వికులూ కనిపించారు. వాళ్లందరూ ద్వారాలను బద్దలుకొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. అదిచూచి చంద్రవర్మ భీకరంగా గర్జిస్తూ తన భటులతో ఒక్కుమ్మడిగా వాళ్లమీద విరుచుకుపడ్డాడు. —(ఇంకా వుంది)





# భర్తను గెలిచిన భార్య

కోసలదేశపు రాజు కింద ఉండిన సామంతులలో వీరసేనుడు ఒకడు. ఆయన వృద్ధుడై చనిపోయేనాటికి ఆయనకు జయంతుడని ఈడు వచ్చిన కుమారు డొకడున్నాడు. జయంతుడితోబాటు మాలిని అనే ఒక పిల్లనుకూడా ఆయన చేరదీసి పెంచాడు. ఈ మాలిని ఒక వైద్యుడి కుమార్తె. ఆమె తండ్రి మూలికావైద్యంలో చాలా ప్రతిభావంతుడు, కొన్ని అమోఘమైన ఔషధాలను తయారుచేశాడు. ఆయన చనిపోయేటప్పుడు ఆ ఔషధాలను మాలినికి ఇచ్చి, వాటిని ఏయే వ్యాధులకు వాడాలో వివరంగా చెప్పాడు. తండ్రి పోయాక దిక్కులేని స్థితిలో ఉన్న మాలినిని వీరసేనుడూ, ఆయన భార్య లక్ష్మీదేవీ చేరదీసి తమ బిడ్డలాగే పెంచారు.

మాలిని చాలా బుద్ధిమంతురాలు, మితభాషిణి, ఎంతో అణకువ గలది. సామంతు ఇంట తనకు ఎంత చనువున్నప్పటికీ ఆమె తనకూ, వారికీ ఉండే తారతమ్యం మరిచి ఎరగదు. అందుకనే, ఆమె చిన్నతనం నుంచీ జయంతుణ్ణి ప్రేమించికూడా తన ప్రేమను తనలోనే దాచుకున్నది. "నక్క ఎక్కడ, నాకలోక మెక్కడ? జయంతుడు ఏ సామంతుల పిల్లనో, మళ్ళీ మాట్లాడితే ఏ మహారాజుల పిల్లనో పెళ్ళాడతాడు. నావంటి దిక్కులేని పక్షిని పెళ్ళాడే కర్మ అతనికేం పట్టింది?" అనుకున్నది.

ఆమె రోజూ కనిపించే మనిషి కావటం చేతనూ, ఆమెలో దర్పం కొంచెంకూడా లేకపోవటంచేతనూ, తనను అకర్షించటానికి ఆమె ఏ ప్రయత్నమూ చేయకపోవటం చేతనూ జయంతుడు ఆమెను గురించి ఎన్నడూ ఆలోచించనుకూడా లేదు.

వీరసేనుడు పోయాక కోసలరాజు జయంతుడికి కబురు పంపాడు. రాజుగారి

ఆర్. కోదండరామయ్య



తరపున శశిభూషణుడనే ఆయన వచ్చి' జయంతుడి తల్లి అయిన లక్ష్మీదేవితో, "అమ్మా, రాజుగారి కొలువులో నీ భర్త ఆక్రమిస్తూ ఉండిన స్థానం ఇప్పుడు జయంతుడిది. రాజుగారి ఆహ్వానం ఆజ్ఞతో సమానం. ప్రస్తుతం రాజుగారు వ్యాధిగ్రస్తులై ఉన్నారు. అది నయమయే వ్యాధి కాదని రాజవైద్యులు తేల్చేశారు. అందుచేత అలస్యం చేయక మీ జయంతుణ్ణి నావెంట పంపెయ్యండి!" అన్నాడు.

"అయ్యో, పాపం! ఈ సమయంలో మాలిని తండ్రే జీవించిఉంటే ఆ వ్యాధి కుదుర్చును. అయన సాక్షాత్తూ ధన్వంతరే!"

అన్నది లక్ష్మీదేవి. ఈ సంభాషణ అంతా వింటున్న మాలిని కంట తడిపెట్టుకున్నది.

ఆమె తన తండ్రిని తలుచుకుని దుఃఖిస్తున్నది కాబోలునని లక్ష్మీదేవి అనుకున్నది. కాని మాలిని దుఃఖించిన కారణం జయంతుడు యిల్లువదిలి రాజుగారి కొలువుకు వెళ్లిపోతున్నాడని.

జయంతుడు వెళ్లిపోయిన చాలా రోజులకు కూడా మాలిని అస్తమానం కళ్లు తుడుచుకుంటూ ఉండటం చూసి లక్ష్మీదేవికి అనుమానం కలిగింది.

కొద్దిరోజులు గడిచాక మాలిని లక్ష్మీదేవితో, "మా నాన్న నాకు తన దివ్యౌషధాలన్నీ ఇచ్చాడు. వాటిని నేను వాడగలను. అందుచేత నేను కోసలనగరానికి వెళ్లి రాజుగారి వ్యాధికి చికిత్స చేద్దామనుకుంటున్నాను," అన్నది.

లక్ష్మీదేవి నవ్వి, "నీవు కోసలనగరం వెళ్లేది రాజుగారి చికిత్సకోసమా, జయంతుణ్ణి మళ్ళీ చూడటానికా?" అని అడిగింది. తరిచి అడిగినమీదట మాలిని తనకు జయంతుడిపై ప్రేమ ఉన్నట్టు ఒప్పుకున్నది. "కాని అతనికి భార్యను కావాలన్న దురాశ నాకు లేదు. మీరు సామంతులు, నేను మిమ్మల్ని ఆశ్రయించి బతుకుతున్న అనా

ధను. రాజుగారికి చికిత్సచేయటానికే నేను బయలుదేరుతున్నాను!" అన్నదామె.

లక్ష్మీదేవి మాలిని ప్రయాణానికి సమ్మతించి, ఆమెవెంట కొందరు నౌకర్లను తోడు పంపింది. మాలిని త్వరలోనే రాజధాని చేరుకుని, రాజుగారి దర్శనం చేసుకుని, తాను వచ్చిన పని చెప్పింది.

తన వ్యాధికి ఈ అర్భకురాలు చికిత్స చేస్తుందని రాజుగారు కొంచెంకూడా నమ్మలేదు. రాజవైద్యులు నయంకాదని రూఢిగా చెప్పిన వ్యాధికి మందు ఎలా ఉంటుంది?

"నీవిచ్చే ఔషధం తీసుకుంటాను. కాని అది వికటించిందో నీ తల తీయిస్తాను. దైవ కృపవల్ల నా వ్యాధి నయమయే పక్షంలో నా కొలువులో ఉన్నవారిలో నీవు కోరిన వాడికి నిన్నిచ్చి వివాహం చేస్తాను. నేను నిర్ణయించిన భార్యలను పెళ్ళాడటం నా సామంతుల విధి. ఈ నిబంధన నీకు సమ్మతమయే పక్షంలో నీవు నాకు వైద్యం చేయవచ్చు," అన్నాడు రాజు.

దీనికి ఒడబడి మాలిని రాజుగారికి వైద్యం చేసింది. రెండు రోజులలో రాజుగారి వ్యాధి నివారణ అయిపోయింది. రాజుగారి ఆనందానికి మేరలేదు. ఆయన మూడవనాడు మాలినిని తనవెంట సభకు తీసుకుపోయి,



"ఈ సభలో ఉన్నవారంతా నా కొలువు చేసేవారే. వీరిలో నీకు కావలిసిన భర్త ఎవరో కోరుకో!" అన్నాడు.

మాలిని సభ అంతటా కలయచూసింది. ఆమెకు ఒకచోట జయంతుడు కనిపించాడు. రాజుగారికి అతన్ని చూపి మాలిని, "ఈయనను పెళ్ళాడతాను, అనుగ్రహించండి!" అన్నది వినయంగా.

రాజుగారు జయంతుణ్ణి పిలిచి, "నీ వీమెను పెళ్ళాడు!" అన్నాడు.

ఈ మాట వినగానే జయంతుడికి మండిపోయింది. "ఇది మా పంచ బతుకుతూ, మమ్మల్ని కనిపెట్టుకునిఉన్న మనిషి.

దీనిని నేనెలా పెళ్ళాడతాను ?" అన్నాడు. మాలిని అవమానంతో తల వంచుకునీ, "మహారాజా, తమ వ్యాధి నయమయింది, అంతే చాలు !" అన్నది.

ఆమె వదిలిపెట్టినా రాజు వదిలిపెట్ట లేదు. మాలినికి ఇచ్చిన మాట చెల్లించటం మాట అటుంచి, తన కొలువులో ఉండేవాడు తన ఆజ్ఞకు ఎదురుచెప్పటం ఆయన సహించలేకపోయాడు, జయంతుడు మాలి నిని పెళ్ళాడితీరాలని ఆయన పట్టుపట్టాడు. ఇద్దరికీ ఆరోజే పెళ్ళి అయింది.

జయంతుణ్ణి మాలినికి భర్తగా చేసే శక్తి రాజుకున్నదిగాని, అతను మాలినిని ప్రేమించేటట్టు చేసేశక్తి లేదు. పెళ్లి పూర్తి కాగానే జయంతుడు తన భార్యతో, "ఇల్లలక గానే పండగ కాలేదు. నన్ను బలాత్కారంగా పెళ్ళాడావేగాని నేను నిన్ను ఏలదలచలేదు. నీవు వెంటనే బయలుదేరి మాఅమ్మవద్దకు వెళ్లిపో !" అన్నాడు.

"నేను మీ దాసీని. నా అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది," అన్నది మాలిని. ఆమె వెళ్లిన పని పూర్తిగా నెర వేరింది, రాజుగారి వ్యాధి నయమయింది, తాను ప్రేమించిన జయంతుణ్ణి పెళ్లాడింది; అయినా ఆమె లక్ష్మీదేవి వద్దకు పుట్టెడు విచారంతో తిరిగి వచ్చింది. ఆమె వెనకనే



జయంతుడి వద్దనుంచి ఆమెకొక సందేశం కూడా వచ్చింది. అందులో అతను, "నా చేతి ఉంగరం నీ చేతికి వచ్చిననాడే నన్ను భర్త అని పిలు. అయితే అలాటి రోజు ఎన్నటికీ రాదని గుర్తుంచుకో!" అని రాశాడు. ఈ వాక్యం చదివి మాలిని కుంగిపోయింది.

లక్ష్మీదేవి మటుకు తన కోడలిని ఎంతో ఆదరంతో చూసింది. తన కొడుకు ఆమె పట్ల అంత కఠినంగా ప్రవర్తించటం ఆమెకు బాధ కలిగించింది. మాలినిని సమదాయించటానికి ఆమె చేతనైనదంతా చేసింది.

జయంతుడు మాలినికి రాసిన ఉత్తరంలో తాను కోసలదేశం విడిచి పోతున్నాననీ, ఆ దేశంలో తనకు భార్య అన్నది లేకుండా పోయేదాకా తిరిగి రాననీకూడా రాశాడు.

ఆ రాత్రి మాలిని తన అత్తగారైన లక్ష్మీదేవికి ఈ విధంగా ఉత్తరం రాసి పెట్టింది: "భర్తను దేశాంతరాలకు తరిమేసి మహాపాతకం అంటగట్టుకున్నాను. ఈ పాపం పరిహారం కావటానికై నేను తీర్థయాత్రలు చేయబోతున్నాను. ఇష్టంలేని భార్య వదిలిపోయిందని మీ కుమారుడికి వర్తమానం పంపండి."

ఆ తరవాత మాలిని ఎవరితోనూ చెప్పకుండా బయలుదేరి తీర్థయాత్రలు చేయటానికి వెళ్లిపోయింది.





ఈలోపల జయంతుడు కోసలదేశం వదిలిపెట్టి కాశీరాజ్యానికి వెళ్లి కాశీరాజు వద్ద కొలువు కుదిరాడు. అతను చేరిన కొద్ది రోజులకే యుద్ధం ఒకటి తటస్థించింది. ఆ యుద్ధంలో జయంతుడు చాలా పరాక్రమం చూపి మంచి కీర్తి గడించాడు. అతను అక్కడ ఉండగానే తల్లివద్దనుంచి వర్తమానం వచ్చింది, మాలిని ఇల్లు విడిచి వెళ్లి పోయినట్టు తెలిసింది.

జయంతుడు చాలా సంతోషించి స్వదేశానికి తిరిగిపోయే ప్రయత్నంలోపడ్డాడు.

ఇంతలో మాలిని కాశీనగరం చేరుకున్నది. ఆమెకు విమలాదేవి అనే ఆవిడ బస ఇచ్చింది. విమలాదేవి భర్త బతికి ఉండగా గొప్ప సంపన్నుడు, గొప్ప వంశానికి చెందినవాడు. అయితే ఆయన పోయాక విమలాదేవి, ఆమె కుమార్తె నీలవేణి అనే పిల్లా ఆధారం లేనివారయారు. అందుచేత విమలాదేవి కాశీనగరం వచ్చే ధనికులైన యాత్రికులకు బసయిచ్చి, వారి అనుగ్రహంతో కాలక్షేపం చేస్తున్నది.

నీలవేణి అందగత్తె. ఆమెకు పెళ్లియీడు వచ్చింది. కాశీరాజు వద్ద కొలువు చేరాక జయంతుడు నీలవేణిని చూసి ప్రేమించాడు, పెళ్లాడగోరాడు, తనతో ఒక్కసారి మాట్లాడవలిసిందిగా ఎన్నోసార్లు కబురు చేశాడు.

పెద్ద వంశంలో పుట్టిన కారణంచేత నీలవేణిలో చిన్నబుద్ధి లేదు. జయంతుడికి అదివరకే పెళ్లి అయిందనీ, ఆ భార్యను అతను విడిచిపెట్టాడనీ తెలిసి ఆమె అతన్ని చూడటానికికూడా ఒప్పుకోలేదు. మాలిని జయంతుడి భార్య అన్న సంగతి తెలియక విమలాదేవి ఈ విషయాలన్నీ ఆమెతో చెప్పేసింది.

అంతా విన్నాక మాలినికి ఒక ఆలోచన తట్టింది. ఆమె విమలాదేవితో తాను ఫలానా అని చెప్పేసి, తనకు సహాయం చెయ్యవలిసిందిగా ఆమెను కోరింది. విమలాదేవి

మాలిని కథ విని జాలిపడి సహాయం చెయ్యా నిశ్చయించింది.

"ఈసారి ఆయన మీ అమ్మాయితో మాట్లాడతానని కబురు చేసినప్పుడు అందుకు ఒప్పుకోమని మీ అమ్మాయితో చెప్పండి. ఆయన వచ్చినప్పుడు ఆయనతో మీ అమ్మాయికి బదులుగా నేనే మాట్లాడ తాను. ఇదే మీరు నాకు చేయవలిసిన సహాయం!" అన్నది మాలిని. ఈ సహాయం చేస్తే తాను వారికి మంచి బహుమతి ఇస్తా ననికూడా ఆమె చెప్పింది. మాలిని క్షేమం కోరి అయితేనేం, బహుమతి వస్తుందన్న ఆశతోనైతేనేం, తల్లి కూతుళ్లు మాలిని చెప్పి నట్టు చెయ్యటానికి ఒప్పుకున్నారు.

మర్నాడు బయలుదేరి తన దేశానికి వెళ్లి పోతున్న జయంతుడికి ఎవరో వచ్చి మాలిని ప్రయాగలో మరణించినట్టు చెప్పారు. ఇది కూడా మాలిని పన్నిన పన్నాగమే. ఈ వార్త విని జయంతుడు పరమానందభరితు డయాడు. ఇక నీలవేణి తనను తప్పక పెళ్లాడుతుందనుకున్నాడు; ఆమెను ఒక్క సారి చూడాలని కోరుతూ కబురు చేశాడు. అతను ఆశ పడ్డట్టుగానే నీలవేణి అతనితో ఆ రాత్రి మాట్లాడటానికి ఒప్పుకున్నట్టు తిరిగి కబురు చేసింది.



ఆ రాత్రి చీకటి పడ్డాక జయంతుడు వచ్చాడు. నీలవేణి ఉన్న గది అతనికి చూపారు. ఆ చీకటిలో తనకోసం వేచిఉన్న మనిషి తన భార్య అయిన మాలిని అని అతనికి ఏమాత్రమూ తెలియదు. ఆ కారణం వల్ల అతను ఆమెతో తన ప్రేమ యావత్తూ చెప్పుకున్నాడు.

మాలినికూడా తనకు అతనిపై గల గాఢ మైన ప్రేమను వర్ణించి చెప్పింది. ఆ మాటలు వింటుంటే అతని మనస్సు పార వశ్యం చెందింది. మాలిని నీలవేణిలాగా నటిస్తూ మాట్లాడినప్పటికీ తనలో నిజంగా ఉన్న భావాలే బయట పెట్టింది. ఇలా చేసే



37

అవకాశం ఆమెకు అదివరలో ఎన్నడూ కలగలేదు.

"నీలవేణీ, నన్ను నీవింతగా ప్రేమిస్తున్నావని నేను కలలోకూడా ఊహించలేదు. నేను రేపు బయలుదేరి మా ఊరు వెళ్లిపోతున్నాను. అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాక, నిన్ను పిలిపించి పెళ్లాడతాను!" అని జయంతుడన్నాడు.

"మీ జ్ఞాపకార్థం నాకు మీ ఉంగరం ఇవ్వండి!" అన్నది మాలిని. ఆమె అతని ఉంగరం తీసుకుని, తనకు కోసలరాజు బహుమతిగా ఇచ్చిన ఉంగరాన్ని అతనికి ఇచ్చింది.

మాలిని సంభాషణనే తలుచుకుంటూ జయంతుడు మర్నాడు తన గ్రామానికి బయలుదేరి వెళ్లాడు. ఆ రోజే మాలినికూడా తన వెంట విమలాదేవినీ, నీలవేణినీ తీసుకుని కోసలరాజధానికి బయలుదేరి వెళ్లింది. అయితే ఆమె అక్కడికి చేరేసరికి రాజుగారు అంతకు ముందే జయంతుడి తల్లిని చూడబోయినట్టు తెలిసింది. ఆమెకూడా అక్కడికే బయలుదేరింది.

రాజుగారు లక్ష్మీదేవిని చూస్తూనే మాలిని గురించి అడిగాడు. అయితే మాలిని చనిపోయిందన్న వార్త లక్ష్మీదేవికి జయంతుడు వచ్చి చెప్పాడు. అది విని రాజుగారు చాలా



విచారించాడు. రాజుగారి వెంటఉన్న శశి భూషణుడు, "జయంతుడెంత నిర్భాగ్యుడు! అతను రాజుగారికీ, తల్లికీ, భార్యకూకూడా ద్రోహం చేశాడు; అంతకన్నకూడా ఎక్కువగా తనకు తాను ద్రోహం చేసుకున్నాడు. మాలిని వంటి సౌందర్యవతీ, బుద్ధిమంతురాలూ, వివేకవతీ మరెక్కడైనా అతడికి దొరుకు తుందా?" అన్నాడు.

జయంతుణ్ణి అక్కడకు పిలిపించమని రాజుగారు అడిగాడు.

కబురు వింటూనే జయంతుడు వచ్చి రాజుగారికి నమస్కారం చేసి, తాను చేసిన తప్పిదాలకు క్షమాపణ కోరాడు.

"పూజ్యురాలైన మీ అమ్మగారిని చూసీ, నీ తండ్రినిబట్టీ నిన్నీసారికి క్షమించాను!" అంటూన్నంతలోనే రాజుగారికి జయంతుడి చేతిన ఉన్న తన ఉంగరం—తాను మాలినికి బహుమతిగా ఇచ్చినది—కన బడింది. దానిని మరెవ్వరికీ ఇవ్వననీ, తనకు ప్రమాదం సంభవించే పక్షంలో రాజుగారికే దానిని తిరిగి అందజేస్తాననీ మాలిని ప్రమాణంకూడా చేసిఉన్నది. అలాటి ఉంగరం జయంతుడి వేలిన ఉండటం చూసి, అతనే మాలినిని చంపి ఉంటాడన్న అనుమానంతో రాజుగారు అతనిని పట్టుకో మని తన భటులను ఆజ్ఞాపించాడు. ఇది



నీకు ఎలా వచ్చిందని రాజుగారు అడిగితే, ఎవరో స్త్రీ దానిని తనమీదికి విసిరివేసిందని జయంతుడు కాకమ్మ కథ ఒకటి చెప్పాడు.

ఇంతలో అక్కడికి విమలాదేవీ, నీలవేణీ వచ్చారు. "మహారాజా, ఈ జయంతుడు నా కుమార్తెను పెళ్లాడతానని ప్రమాణం చేసి ఉన్నాడు. అతను తన మాట నిలబెట్టుకునే లాగు చేయించండి!" అన్నది విమలాదేవి.

రాజుగారికి వెరిచి జయంతుడు తాను నీలవేణిని పెళ్లాడతానని మాట ఇవ్వలేదన్నాడు. వెంటనే నీలవేణి అతని ఉంగరం తీసి, "ఈ ఉంగరాన్ని నాకిచ్చి, తన వేలిన ఉన్న ఉంగరం నా దగ్గరనుంచి తీసుకున్నాడు!" అన్నది.

ఈ నాటకం ఆడటంకోసం మాలిని జయంతుడి ఉంగరాన్ని నీలవేణికి ఇచ్చి ఉన్నది. అయితే రాజుగారు ఈ మాటలు వినగానే, మాలిని హత్యలో ఈ తల్లి కూతుళ్లకు కూడా భాగం ఉన్నదనుకున్నాడు.

"ఈ జయంతుడి చేతిన ఉన్న ఉంగరం మీకెలా వచ్చింది? నిజం చెప్పండి, లేకపోతే మిమ్మల్ని కఠినంగా శిక్షిస్తాను," అన్నాడు రాజుగారు వారితో.

"మహారాజా ఆగ్రహించకండి. మేమా ఉంగరాన్ని ఒకరినుంచి కొన్నాం! కావలిస్తే వారిని ఇప్పుడే తీసుకువస్తాం!" అంటూ విమలాదేవి అవతలికి వెళ్లి మాలినిని వెంట తీసుకు వచ్చింది.

మాలిని సజీవంగా కనబడగానే రాజుగారికీ, జయంతుడి తల్లికీ పరమానందమయింది. ఆమె కథ విన్న తరవాత జయంతుడికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. ఆ రోజు రాత్రి ఆమెతో తాను జరిపిన సంభాషణను అతను ఇంకా మరవలేదు. ఆ మాట్లాడినది తన భార్యే అని తెలిశాక అతనికి ఎంతో సంతోషం కలిగింది. అతను తన భార్యకు క్షమాపణ చెప్పుకుని ఆమెతో సుఖంగా జీవించసాగాడు.





# కీలుగుర్రం

## 5

[ తన ప్రియురాలిని నగరం వెలపల ఉద్యానంలో దించి, ఆమె రక్షణలో కీలుగుర్రాన్ని ఉంచి రాజకుమారుడు అక్మార్ తన తండ్రితో మాట్లాడటానికి వెళ్లి ఉన్న సమయంలో సిద్ధుడు అటుగా వచ్చి, రాజకుమార్తెకు మాయమాటలు చెప్పి ఆమెను కీలుగుర్రంపై ఎక్కించుకుని రూమ్‌దేశం చేరాడు. వెంటనే అక్కడి సుల్తాను ఆయనను పట్టి చీకటి కొట్టులో బంధించాడు. సుల్తాను రాజకుమార్తెను పెళ్లాడదామనుకున్నాడు గాని ఆమెకు కాస్తా మతిపోయింది. ఈలోపుగా రాజకుమారుడు అక్మార్ తన ప్రియురాలిని వెతుకుతూ బయలుదేరి, రూమ్‌నగరం చేరుకున్నాడు. పరదేశీలను రాజుగారు ప్రశ్నించినాకనే వారు నగరంలో ప్రవేశించాలని నియమం ఉండటంచేత అక్మార్‌ను రాజభటులు ఆ రాత్రి ఖైదులో ఉంచారు. అక్కడ సిద్ధుడికీ అక్మార్‌కూ సంభాషణ జరిగింది. సిద్ధుడని అక్మార్‌కు తెలుసును గాని, అక్మార్ అని సిద్ధుడికి తెలియదు.]

మర్నాడు తెల్లవారి రాజభటులు అక్మార్‌ను ఖైదునుంచి విడిపించి, తీసుకుపోయి సుల్తాను ఎదట హాజరుపెట్టారు. అతను పరదేశీ అనీ, కిందటి సాయంకాలం పొద్దుపోయి నగరానికి రావటంవల్ల సుల్తానుగారి ఎదటికి తీసుకువచ్చే అవకాశం లేకపోయిందనీ వారు చెప్పారు.

"మీది ఏ దేశం? నీ పేరేమిటి? మా రాజ్యానికి ఏం పనిమీద వచ్చావు?" అని సుల్తాను అక్మార్‌ను అడిగాడు.

అర్. దయానందరావు




చేశావంటే నీవేది కోరితే అది తడువుకో కుండా ఇస్తాను," అన్నాడు.

"అల్లా దయవల్ల ఏలినవారు చల్లగా ఉండాలి! ఆ అమ్మాయికి మతి ఎలాటి పరిస్థితులలో చెడిపోయిందో కాస్త వివరించి చెబుతారా?" అని అక్మార్ అడిగాడు.

సుల్తాను జరిగిన కథ అంతా చెప్పి, "ఆ ముసలివాణ్ణి చితక కొట్టించి చీకటికొట్టులో వేయించాను," అన్నాడు.

"కొయ్యగుర్రం ఏమయింది?" అని అక్మార్ అడిగాడు.

"దాన్ని నా సేవకులు భద్రంగా కాపాడు తున్నారు," అన్నాడు సుల్తాను.

"నాపేరు హర్జా. మాది పర్షియాదేశం. నేను మానసిక వ్యాధులు చికిత్స చేస్తూ దేశసంచారం చేస్తున్నాను. పెద్దపెద్ద తల పాగాలు చుట్టి, పంచాంగాలు చూసి వైద్యం చేసే పద్ధతి నాకు సరిపడదు. నేను మంత్రాలు జపించను," అని అక్మార్ జవాబు చెప్పాడు.

ఈమాట విని సుల్తాను పరమానందం చెంది, "నీవంటి వైద్యుడే నాకిప్పుడు అవ సరంగా కావాలి. నేను ఒక అందగత్తెను పెళ్లాడదామనుకుంటూ ఉండగా ఆమెను పిశాచాలు ఆవహించి మతి పోగొట్టాయి. ఆ పిల్లకు చికిత్స చేసి మామూలు మనిషిని

ఆ గుర్రాన్ని ఒకసారి మళ్లీ చూసి దాని మీటలు సరిగా పని చేస్తున్నదీ లేనిదీ తెలుసు కోవాలని అక్మార్‌కు కోరిక కలిగింది. గుర్రం చెడిపోకుండా ఉంటే తన కార్యక్రమం ఒక విధంగా ఉంటుంది; అది చెడిపోయి ఉంటే మరొక విధంగా ఉంటుంది. అందుచేత అతను సుల్తానుతో, "అయ్యా, ఆ గుర్రాన్ని నేను ఒక్కసారి చూడాలి. ఎందుచేతనంటే ఈ కన్యకు మతిపోవటానికీ ఆ గుర్రానికీ ఏదైనా సంబంధం ఉండవచ్చు!" అన్నాడు.

"దానికేం ముభ్యంతరం?" అంటూ సుల్తాను అక్మార్‌ను తనవెంట గుర్రం ఉన్న

చోటికి తీసుకుపోయాడు. అక్మార్ గుర్రాన్ని పరీక్షించి మీటలన్నీ సరిగానే ఉన్నట్టు తెలుసుకున్నాడు.

"అల్లా ఏలినవారిని చల్లగా చూడాలి! ఇప్పుడు మనం రోగిని చూద్దాం! ఆమెకు పట్టుకున్న మనోవ్యాధిని కుదర్చగలనన్న ధైర్యం నాకిప్పుడు కలిగింది!" అన్నాడతను సుల్తానుతో.

ఇద్దరూ కలిసి రాజకుమార్తె నహర్ ఉన్న గదికి వెళ్ళారు. ఆమె చేతులు తిప్పుతున్నది, గుండె బాదుకుంటున్నది, బట్టలు చించి పోగులు పెడుతున్నది. అక్మార్ ఆమెను చూస్తూనే అదంతా నటన అనీ, ఆమెకు ఏ దయ్యమూ పట్టలేదనీ, మతి పోలేదనీ తెలుసుకున్నాడు. అతను ఆమెను సమీపిస్తూ, "త్రిభువనసుందరీ, నీకు మన శ్శాంతి కలుగుగాక!" అన్నాడు.

ఈ మాటలు వింటూనే రాజకుమార్తె తన ప్రియుడికేసి చూసి గుర్తించింది. ఆమె ఆనందపారవశ్యంలో కెవ్వున అరిచి మూర్ఛపోయింది. వైద్యుణ్ణి చూడగానే దయ్యం పారిపోయిందనుకున్నాడు సుల్తాను. అయనను గది వాకిలివద్ద ఆగమని చెప్పి అక్మార్ రాజకుమార్తెవద్దకు వెళ్ళి ఉపచారాలు చేసి మూర్ఛ తేర్చాడు. తరవాత అతను రహస్యంగా ఆమెతో, "ఇంకా కొంచెం ఓపిక





పట్టావంటే మనమీ సుల్తాను చెరనుండి బయట పడతాం. నీకు దయ్యం పట్టిందని సుల్తానుతో చెబుతాను," అన్నాడు.

రాజకుమార్తె నహర్‌కూడా రహస్యంగా, "సరే!" అన్నది.

అక్మార్ సుల్తాను నిలబడి ఉన్న చోటికి తిరిగి వచ్చి, "ఈమెకు దయ్యం పట్టింది. దాన్ని నేను వదిలించాను. ఇప్పుడు మీరు వెళ్ళి మంచిగా పలకరించండి. మీరు ఆమెకు ఏమేమి వాగ్దానాలు చేద్దామనుకున్నారో అవన్నీ చేసెయ్యండి. అంతా మీకు అనుకూలంగా జరుగుతుంది, భయంలేదు!" అన్నాడు.

అత్యాశ్చర్యం చెందుతూ సుల్తాన్ రాజకుమార్తె నహర్‌ను సమీపించాడు. ఆయన రావటం చూసి ఆమె లేచి నిలబడి సలాం చేసి, "నన్ను చూడవచ్చారా? ధన్యురాలిని!" అన్నది.

ఈ మాటలు విని సుల్తాను ఆనందోత్సాహంతో మూర్ఛపోయినంత పని చేశాడు. ఆయన అక్కడ ఉన్న బానిసలనూ, కొజ్జాలనూ పిలిచి, "మీరు ఈమెను కనిపెట్టుకుని ఉండండి. ఈమెను స్నానశాలకు తీసుకుపోయి చక్కగా స్నానం చేయించి, మంచి బట్టలు కట్టించి, నగలతో అలంకరించండి," అన్నాడు. వారు సుల్తాను చెప్పిన ప్రకారమే ఆమెచేత స్నానం చేయించి ఆమెకు రాజవస్త్రాలు కట్టబెట్టి, మెడలో రత్నహారం వేశారు. ఆమె పున్నమిచంద్రుడులాగా ప్రకాశిస్తూ సుల్తానువద్దకు వచ్చింది.

సుల్తాను అక్మార్ వంక తిరిగి, "నాకు ఇంత సుఖం సమకూర్చిన నీవు మామూలు వైద్యుడవు కావు. నీ ఋణం ఎలా తీర్చుకోవాలి! అల్లా నీకు అష్టఐశ్వర్యాలూ చేకూర్చాలి!" అన్నాడు.

"మహాప్రభూ, చికిత్స ఇంకా కొద్దిగా దిగబడి ఉన్నది. తమ సెలవైతే దాన్ని ముగిస్తాను. ఆ గుర్రం ఉన్నది చూశారా,

అందులోనే దయ్యం కిటుకు ఉన్నది ; నేను ఆ సంగతి ముందే అనుమానించాను. ఆ దయ్యాన్ని మారణహోమం చెయ్యగలందులకు మనం ఈ గుర్రం దొరికిన చోటికి గుర్రంతో ఈమెతోసహా వెళ్ళాలి. ఈ గుర్రంలో ఉన్న దయ్యాన్ని మారణహోమం చేయని పక్షంలో నెలనెలా అది ఈమెను పీడిస్తూనే ఉంటుంది. ప్రతిసారీ దాన్ని నేను పారదోలుతూ ఉండాలి. అలాటి చిక్కు లేకుండా నేను చేస్తాను," అన్నాడు అక్మార్.

సుల్తాను ఇందుకు సమ్మతించాడు. సుల్తానూ, ఆయన పరివారమూ, అక్మార్, నహార్ నగరం వెలపల ఉండే మైదానానికి గుర్రంతోసహా బయలుదేరి వెళ్ళారు. రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని ఒకచోట ఉంచి దానిపై రాజకుమార్తెను ఎక్కించాడు. సుల్తానునూ పరివారాన్నీ దూరంగా ఉండమని అతను సుల్తానుతో, "మహాప్రభూ, ఈ గుర్రంలో ఉండే భూతాన్ని మీకు ప్రత్యక్షంగా చూపుతాను. నేను ఆ గుర్రంపైకి ఎక్కి మంత్రాలు చదవగానే ప్రాణం లేని ఈ గుర్రం కదిలి అడుగులు వేసుకుంటూ మీదగ్గిరికి వస్తుంది. తరవాత మీరు ఆ కన్యను గుర్రంపైనుంచి దింపి పెళ్లాడేసుకోవచ్చు," అన్నాడు.



సుల్తాను ఆశ్చర్యానికి ఉత్సాహంకూడా జత అయింది. ఇదంతా ఎలా జరుగుతుందో చూడాలని ఆయన ఉబలాటపడ్డాడు. అక్మార్ సుల్తానుదగ్గిరనుంచి గుర్రంవద్దకు నడిచివెళ్లి, దాని పైకెక్కి మీట నొక్కాడు. గుర్రం గాలిలోకి లేచి అంతరిక్షంలోకి సూటిగా వెళ్లి అంతర్ధానమైపోయింది.

కాని అంతటితో తన ఆట కట్టిందని సుల్తానుకు అర్థంకాక ఆయన ఆ పూట అంతా ఆ మైదానంలోనే ఉండి గుర్రం తిరిగిరావటంకోసం ఎదురుచూశాడు. తరవాత ఆయన తన భవనానికి తిరిగిపోయి ఇంకా గుర్రం రాకకోసం ఎదురుచూస్తూనే

ఉన్నాడు. తన ఆశ నిరాశ అని తెలిసి పోయాక ఆయన చీకటికొట్టులో ఉన్న ముసలి సిద్ధుణ్ణి తన ఎదటికి రప్పించి, "ఓరీ, అధముడా! ఆ గుర్రంలో దయ్యం ఉన్న సంగతి ఎందుకు చెప్పావుకావు? ఆ పిల్లకు చికిత్సచేసిన వైద్యుణ్ణీ, ఆ పిల్లనూ కూడా దయ్యం తీసుకుని ఆకాశంలోకి వెళ్లి పోయింది. పాపం, వాళ్లేమవుతారో! అదీ గాక ఆ పిల్లకు నేను బోలెడన్ని నగలు పెట్టాను. అవన్నీ పోయాయి. అందుచేత నీ తల తీయించేస్తాను," అన్నాడు.

ఆయన చెయ్యి ఊపగానే భటుడొకడు కత్తి ఎత్తి సిద్ధుడి తల తెగవేశాడు.

ఈలోపల రాజకుమారుడు అక్మార్ తన ప్రియురాలితో సహా క్షేమంగా తన ఊరు చేరుకున్నాడు. అతను ఈసారి వనంలో విడిది చేసే ప్రమేయం పెట్టుకోక, గుర్రాన్ని నేరుగా తమ భవనంపైన గల మిద్దెమీద దించాడు. అతను కిందికి దిగి వెళ్లేసరికి అతని తలిదండ్రులూ, ముగ్గురు చెల్లెళ్లూ ఎంతో విచారంగా కూచుని ఉన్నారు. అతన్ని చూడగానే వారికి ప్రాణాలు లేచివచ్చి నట్టయింది.

రాజకుమారుడు అక్మార్‌కూ, సనా రాజ కుమార్తె నహార్‌కూ వైభవంగా వివాహం జరిగింది. ఊరేగింపులూ, ఉత్సవాలూ, విందులూ, వినోదాలూ ఒక నెలపాటు సాగాయి. అక్మార్ జరిగిన కథ యావత్తూ ఉత్తరం రాసి ఒక దూతద్వారా తన మామ గారికి అందజేస్తూ ఆయనకు, అంతులేని కట్నకానుకలుకూడా పంపాడు.

సాబూర్ చక్రవర్తి కీలుగుర్రాన్ని విరగ గొట్టించి, దాని యంత్రాలన్నిటినీ నాశనం చేయించాడు; అప్పటికిగాని ఆయన మనస్సు స్థిమితపడలేదు. తన మామగారూ, తండ్రీ పోయిన అనంతరం అక్మార్ రెండు దేశా లకూ రాజై సుఖంగా రాజ్యపాలన చేశాడు.

—(అయిపోయింది)





# దురాశాపరుడు

బొగ్దాద్ నగరానికి ఖలీఫా అయిన హారూన్ అల్ రషీద్ ఒకనాడు మారువేషంలో నగర సంచారానికి బయలుదేరాడు. ఆయనవెంట మంత్రి జాఫర్, అంగరక్షకుడు మస్రూర్ కూడా మారువేషాలలో ఉన్నారు. ఆయన వీధులన్నీ తిరిగి టిగ్రిస్ నదిపై ఉండే రాతి వంతెనవద్దకు వచ్చేసరికి అక్కడ ఒక కళ్ళు లేని ముసలి బిచ్చగాడు దారే పోయేవారిని ధర్మం అడుగుతూ కనిపించాడు.

ఖలీఫా ఆ ముసలివాణ్ణి చూసి జాలిపడి వాడి చేతిలో ఒక బంగారు దీనారం ఉంచాడు. వెంటనే ఆ గుడ్డివాడు ఖలీఫా చెయ్యి గట్టిగా పట్టేసి, "బాబూ, అల్లా మిమ్మల్ని అనుగ్రహిస్తాడు. మీరుమాత్రం నా గూబమీద ఒక్క దెబ్బవేసి మరీ వెళ్ళాలి! గుడ్డివాణ్ణని ఏమాత్రం సందేహించకండి," అని, ఆయన చెయ్యి వదిలిపెట్టి చొక్కా పట్టుకున్నాడు.

"అయ్యో, పెట్టిన చేత్తో కొట్టటమెలా? అందులోనూ నీవంటి ముసలివాణ్ణి కొట్టితే అల్లా క్షమిస్తాడా?" అంటూ ఖలీఫా వాడి పట్టు తప్పించుకోవటానికి ప్రయత్నించాడు.

కాని గుడ్డివాడు ఆయనను పోనివ్వక, "బాబూ, దెబ్బ తినకుండా నేను ధర్మం పుచ్చుకోలేను. నా సంగతి తెలిస్తే మీరు నా కోరికను తప్పకమన్నిస్తారు. దయచేసి ఒక్క దెబ్బకొట్టి మరీ వెళ్ళండి," అన్నాడు.

దారే పొయ్యేవారంతా చూసి నవ్వుతారని ఖలీఫాకు బిడియంవేసింది. దెబ్బకొడితేగాని ముసలివాడు వదిలేటట్టు లేడు. అందుచేత ఆయన ముసలివాడి గూబమీద ఒక్క దెబ్బకొట్టి ముందుకు సాగాడు. వెనకనుంచి గుడ్డివాడు ఆయనను ఆశీర్వదిస్తూ ఉండటం వినవచ్చింది.

ఖలీఫా జాఫర్‌తో, "ఈ ముసలివాడి కథ ఏమిటో తెలుసుకోవాలని నాకు చాలా

డి. నారాయణస్వామి



కుతూహలంగా ఉంది. నువు వెనక్కు వెళ్లి, రేపు మధ్యాన్నం రాజభవనంవద్ద హాజరు కమ్మని నా ఆజ్ఞగా వాడితో చెప్పిరా!" అన్నాడు. జాఫర్ అలాగే చేశాడు.

మర్నాడు మధ్యాన్నం ప్రార్థనలు ముగిసి నాక ఖలీఫా దీవాన్‌లోకి రాగానే జాఫర్ ముసలి గుడ్డిబిచ్చగాణ్ణి ఖలీఫా సమక్షానికి పిలిపించాడు. ఖలీఫా ఆజ్ఞాపించినమీదట ఆ బిచ్చగాడు తన కథను ఈ విధంగా చెప్పసాగాడు :

నా పేరు బాబా అబ్దల్లా. నేను చిన్న తనంనుంచీ ఒంటెలు తోలుతూ బతికాను. నేను చూపిన శ్రద్ధాసక్తుల ఫలితంగా ఎనభై ఒంటెలను సంపాదించుకున్నాను. వాటిని వర్తకులకూ, యాత్రికులకూ అద్దెకిస్తూ ఏటా మంచి లాభాలు సంపాదిస్తూ వచ్చాను. ఇరాక్‌లో నాలాగ జీవించేవారందరికన్నా నేను ధనికుణ్ణి కావాలని కలలు కంటూ ఉండేవాణ్ణి.

ఒకసారి నేను ఇండియాకు రవాణా అవుతున్న సరుకును బస్రా రేవుకు చేర్చటం జరిగింది. బస్రానుంచి నేను ఖాళీ ఒంటెలతో తిరిగివస్తూ, ఒక నీటితొట్టెవద్ద ఆగి ఒంటెలకు నీరు పెట్టి, భోజనంచెయ్యటానికి కూచున్నాను. ఆ సమయానికే ఒక ఫకీరు అక్కడికి వచ్చాడు. ఎడారి ఆచారం ప్రకారం మేము మా ఆహారాన్ని ఒకరితో ఒకరం పంచుకుని భోజనంచేసి అవీ ఇవీ మాట్లాడుకున్నాం.

మాటల సందర్భంలో నేను ఆ ఫకీరుకు నేను కనే కలలను గురించి చెప్పాను. అతను నవ్వి, "పిచ్చివాడా, అదృష్టం కలిసి వస్తే ఒక్క క్షణంలో నవనిధులూ దొరికే టప్పుడు నీవు ధనంగురించి కలలు కనటం వెర్రికాదా ? భూమిలోపల పాతిపెట్టి ఉండే నిధులను గురించి నువ్వెన్నడూ వినలేదా ? నేను నీకు తటస్థపడటం నీ అదృష్ట మను కుంటాను. నావెంట రా!" అన్నాడు.



ఇంతకాలానికి నా అదృష్టం పండింది కాబోలు ననుకుంటూ నేనా ఫకీరు వెంట బయలుదేరాను. ఒక గంటకల్లా మేమొక సన్నని కనుమలోనుంచి ఒక లోయలోకి ప్రవేశించాం. ఆ లోయలో ఒక ఎత్తయిన కొండ నిటారుగా ఉన్నది.

"ఇదే మన చోటు. నీ ఒంటెలన్నిటినీ పడుకోబెట్టు. వాటిమీద ధనపు మూటలు వేద్దాం!" అన్నాడు ఫకీరు. నేను ఒంటెలను అయత్తం చేసి తిరిగి వచ్చే లోపల ఫకీరు కొండ దిగువన చితుకులు పేర్చి మంట చేశాడు. ఆ మంటలో గుగ్గిలం చల్లుతూ నాకు అర్థంగాని మంత్రాలేవో చదివాడు.

కొద్దిసేపటికల్లా గాలికి గుగ్గిలం పొగ విచ్చిపోయే సరికి కొండలో ఉన్న ఒకరాయి రెండుగా విచ్చిపోయి లోపల ఉన్న గుహ నాకు కనబడింది.

ఆ గుహనిండా బంగారు కాసులూ, రత్నాలరాసులూ ఉన్నాయి. నేను ఆత్రంగా బంగారుకాసులపైన పడి రెండుచేతులా వాటిని తీసుకుని నావెంటతెచ్చిన సంచీలో పోసుకోసాగాను. ఇది చూసి ఫకీరు, "పేద వాడా, నీ ఒంటెలు బంగారం ఎంతని మోస్తాయి? ఆ వెనక ఉన్న రత్నరాసులు చూడు. అవి బంగారంకన్న నూరింతలు బరువు తక్కువ, వెయ్యింతలు విలువ





అని విచారిస్తూ, ఫకీరు ఆ బరిణను తన చొక్కాలోపల దాచటం గమనించి ప్రశ్నార్థకంగా చూశాను.

"ఇందులో కంటికి రాచుకునే అంజనం తప్ప మరేమీ లేదు," అన్నాడు ఫకీరు. జాడీలోనుంచి నేనుకూడా ఒక బరిణ తీసుకోవటానికి ప్రయత్నించబోతూంటే అతను నన్ను వారించి, "ఇవాళకు ఈ తీసుకున్నది చాలు!" అన్నాడు.

మేము బయటికి వచ్చాక ఫకీరు ఏదో మంత్రం చదివాడు, రాయి ఎప్పటిలాగా మూసుకుపోయింది. అతుకుకూడా ఏమాత్రం తెలియరాలేదు.

ఎక్కువ. అందుచేత నీ ఒంటెలమీద వాటిని ఎక్కించుకో!" అన్నాడు.

అది నిజమేనని ఒప్పుకుని నేను సంచుల నిండా రత్నాలు పోసుకుని ఒంటెలపై వేయసాగాను. నేనీ పని చేస్తున్నంతసేపూ ఫకీరు ఒకపక్కగా నిలబడి, నాకేసి చిరునవ్వుతో చూస్తూ ఉన్నాడు. నా పని పూర్తి కాగానే అతను, "ఇక మనం ఈ గుహ మూసి వెళ్లిపోవచ్చు!" అంటూ అక్కడవున్న ఒక బంగారు జాడీలో చెయ్యి పెట్టి చిన్న బరిణ ఒకటి తీసుకున్నాడు.

నాదగ్గిర ఎనభైవేల ఒంటెలుంటే ఎంత బాగుండేది, ఎనభయ్యే ఉండిపోయాయే

"మనం బయలుదేరిన చోటికి తిరిగి వెళ్లగానే ఈ రత్నరాసులను చెరిసగం పంచుకుందాం," అన్నాడు ఫకీరు. ఇద్దరమూ తిరిగి వచ్చేటప్పుడు నేను ఆలోచించగా అతనికి సగంసొత్తు ఇవ్వటం అనవసరమని తోచింది. ఎందుకంటే నా ఒంటెలు లేకపోతే అతనికి ఈ రత్నాలను తెచ్చుకునే మార్గం లేదు. అదీగాక నేను వెంట ఉంటేనే తప్ప ఆ గుహ తెరుచుకోదేమో! నేనే శ్రమపడి ఈ సంచులన్నీ ఒంటెలపైకి ఎత్తాను. అతను నిలబడి చిరునవ్వు నవ్వటం తప్ప ఏమీ శ్రమపడలేదు.



మేము బయలుదేరిన చోటు చేరుకోగానే, "అయ్యా, ఫకీరూ, సన్యాసిలాగా తిరిగే నీకు నలభైఒంటెల బరువు రత్నాలు దేనికి? అవి ఉన్నచోటు చూపించినందుకు నీకు అంత వాటా ఇవ్వాలా!" అన్నాను.

నా మాటకు ఫకీరు ఆగ్రహించక, "పిచ్చివాడా, నేను దీన్ని బీదసాదలకు పంచుతాను, లేకపోతే నాకీ ధనం దేనికి? నీకు ఒకటి తెలియలేదల్లే ఉంది: ఒక్కొక్క ఒంటెపైనా ఒక మహారాజు విలువచేసే రత్నాలున్నాయి. నలభై ఒంటెలు వెంట పెట్టుకుపోయినా బాగ్దాదులో నీకన్న ధనికుడుండడు. అందుచేత అనవసరంగా దురాశ పడకు," అన్నాడు.

ఆ మాట నిజమేనని తెలిసికూడా, "నేను అందుకు చెప్పలేదు; కాని ఒంటెలను తోలటం చాలా గడ్డుపని. అలవాటు లేనివాడివి నలభై ఒంటెలను నడపలేవు, అవన్నీ నీకు దక్కవని చెప్పాను! అదీగాక నీకీ గుహ తెలుసు గనక ఎప్పుడు కావలిస్తే అప్పుడు మళ్లీ వచ్చి రత్నాలు తీసుకుపోవచ్చు. కొద్ది ఒంటెలనే తీసుకోవటం మంచిది," అన్నాను.

"అదీ నిజమే. నాకు ఇరవై ఒంటెలను మాత్రం ఇయ్యి," అన్నాడు ఫకీరు. అతను



అంత సులువుగా నామాట విన్నందుకు సంతోషించి అతనికి ఇరవై ఒంటెలిచ్చాను. అతను బస్రాదారి పట్టాడు, నేను బాగ్దాదు దారి పట్టాను.

కాని కొద్దిదూరం వెళ్లానో లేదో దురాశ నన్ను తినివెయ్యసాగింది. ఫకీరు తీసుకుపోతున్న ఇరవై ఒంటెలమీదా ఉన్న రత్నాలతోబాటు నా ప్రాణాలుకూడా పోతున్నాయనిపించింది. నేను నా ఒంటెలను ఆపి ఫకీరును ఎలుగెత్తి పిలుస్తూ వెనక్కు పరిగెత్తాను. ఫకీరు నా కేకలు విని ఆగాడు.

నేను ఫకీరుకు ఏవేవో కారణాలు చెప్పి, బతిమాలి, కంట నీరు పెట్టుకుని ఆ ఇరవై

ఒంటెలనుకూడా నాకే ఇవ్వటానికి ఒప్పించాను. తరవాత నేనతన్ని కౌగలించుకుని సెలవు అడిగాను.

"తమ్ముడూ, అల్లా అనుగ్రహించి ఇచ్చిన ఈ ధనాన్ని వివేకంతో ఖర్చు చెయ్యి, నన్ను మరిచిపోకు!" అన్నాడు ఫకీరు.

అప్పటికైనా నేను వెళ్లిపోతే ఎంత బాగుండేది! కాని నాకా రోజు మంచిది కాదు. ఆ ఫకీరు తన చొక్కాలో దాచుకున్న బరిణ నాకు జ్ఞాపకం వచ్చింది. అది కూడా తీసుకుంటేగాని నా అదృష్టం పూర్తి కాదనిపించింది. అందులో ఈ రత్నాలన్నిటి కన్నా విలవైనదేదో ఉండాలి; లేకపోతే ఆ ఫకీరు ఆ బరిణ ఉంచుకుని రత్నాలన్నిటినీ నాకు అంత సులువుగా ఇచ్చిఉండడు.

"అన్నా, ఒక్కటి చెప్పు. ఆ అంజనంతో ఏం చేస్తావు? నీ జ్ఞాపకార్థం ఆ బరిణ నాకివ్వరాదా?" అన్నాను. ఫకీరు దాన్ని ఇష్టపడి ఇవ్వకపోతే వాణ్ణి అక్కడే చంపి అయినా దాన్ని తీసుకునేటందుకు నేను సిద్ధపడ్డాను. కాని అతను చిరునవ్వు నవ్వుతూ ఆ బరిణ నాకిచ్చేసి, "నావల్ల ఇంకేమైనా సహాయం కావలిసి ఉంటే చెప్పు!" అన్నాడు.

నేను బరిణ మూత తీసి, "అన్నా, ఈ అంజనంవల్ల ఉపయోగ మేమిటో అదికూడా





చెప్పి పుణ్యం కట్టుకో !" అన్నాను. అందుకు అతడు, "ఈ అంజనాన్ని ఎడమ కంటి రెప్ప అంచున రాచుకుంటే భూమిలో ఉండే నిధి నిక్షేపాలన్నీ కనిపిస్తాయి. దాన్ని కుడి కంటికి రాచుకుంటే రెండు కళ్లూ పోతాయి !" అన్నాడు

ఈమాట చెప్పి ఫకీరు వెళ్లబోతుంటే నేనతన్ని చొక్కాపట్టి ఆపి, "దీని మహత్యం కూడా నీ చేతిమీదుగానే నాకు తెలియ జెయ్యి. దీన్ని నా ఎడమ కంటికి కాస్త రాయి !" అన్నాను.

ఫకీరు అంజనం కొంచెం తీసి నా ఎడమ కంటి రెప్పమీదా, కంటి చుట్టూరా రాచి, "ఇప్పుడు కుడి కన్ను మూసి, ఎడమ కన్ను తెరిచి చూడు," అన్నాడు. నేను అలాగే చూశాను. నా ఎడమ కంటికి ఎదురుగా ఉండే దృశ్యం కనబడటానికి బదులు భూమిలో, కొండలలో, పెద్ద పెద్ద చెట్లకిందా, సముద్రం అడుగునా ఉండే నిధి నిక్షేపాలు కనిపించాయి. గనులలో ఉండే వెండి బంగారాలూ, రత్న మాణిక్యాలూ కనిపించాయి. చివరకు కుడి కన్ను తెరిచాను, అప్పుడుగాని నాకు మామూలు దృష్టి తిరిగి రాలేదు.

ఆ అంజనం ప్రభావం చూశాక, దాన్ని గురించి ఫకీరు చెప్పిన రెండో విషయం

నాకు అనుమానాస్పదంగా తోచింది. ఒక కంటికి పూసుకుంటే ఇంత అద్భుతమైన దృష్టి ఇచ్చే అంజనం రెండో కంటికి పూసుకుంటే రెండు కళ్లూ పోగొట్టుతుందని నేను నమ్మలేకపోయాను.

నేను కుడి కంటికి ఆ అంజనం పూసుకోకుండా చెయ్యటానికే ఫకీరు అలా చెప్పి ఉంటాడని అనుమానించాను.

"అన్నా, ఈ అంజనాన్ని నా కుడికంటికి కూడా రాయి. నాకు తెలుసును. అలా రాచావంటే నేను చూసిన నిధులన్నీ నాకు వశమవుతాయి. నన్ను మోసపుచ్చాలని చూస్తున్నావు. నేనంత సులువుగా మోసపోను!" అన్నాను.

ఈ సారి ఫకీరుకు నామీద కోపంవచ్చింది. "నువు నాశనం కోరి తెచ్చుకుంటున్నావు. నేనాపని చెయ్యను నన్ను వెళ్ళనీ!" అన్నాడతను. కాని అతన్ని నేను పోనివ్వక, నా కుడికంటికికూడా అతడిచేత అంజనం రాయించుకున్నాను. వెంటనే నా కళ్ళు రెండూ పోయాయి.

నా దృష్టి నాకు తిరిగి ఇవ్వమని ఎంతో వేడుకున్నాను. కాని ఫకీరు జవాబు చెప్పకుండా నా ఎనభైఒంటెలనూ తోలుకుని వెళ్లిపోయాడు. నేను అక్కడే ఉండిపోయాను. మర్నాడు అటుగా ఒక బిడారు వచ్చి నన్ను బాగ్దాదు చేర్చింది. ఆ రోజు మొదలుకుని నేను బిచ్చగాడుగా బతుకుతున్నాను. నాకు ధర్మంచేసిన ప్రతివాడిచేతా చెంపదెబ్బ తినటం నేను ఒక నియమంగా పెట్టుకున్నాను.

ఈ కథ విని ఖలీఫా, "బాబా అబ్దల్లా, నీ దురాశకు తగిన శిక్ష అదివరకే అనుభవించావు. ఇక బిచ్చం ఎత్తకు. నేను నీకు రోజూ పది దిరాము లిప్పిస్తాను. బతికి ఉన్నన్నాళ్లూ నీ పోషణ జరిగేటట్టు చూస్తాను," అని చెప్పి ఆ ప్రకారమే గుడ్డి బిచ్చగాడికి భరణం ఏర్పాటు చేయించాడు.





# చేజిక్కిన శత్రువు

పట్టువిడవని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఇంకొకసారి శ్మశానంకేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ ప్రపంచంలో నీలాంటి సన్మార్గులు వ్యర్థశ్రమకు గురి అవుతారు; రాజభూషణుడివలె మహాద్రోహం చేసినవారు కూడా శిక్ష పొందక తప్పించుకుంటారు. నీకు శ్రమ తెలియకుండా వుండగలందులకు అతని కథ చెబుతాను విను!" అంటూ ఈవిధంగా చెప్పసాగాడు :

పూర్వం మణిప్రస్థ నగరంలో రాజభూషణుడనే వైద్యుడుండేవాడు. అతను భరతఖండం అన్నిమూలలూ తిరిగి వివిధ దేశాలలో వుండే ఘనవైద్యులవద్ద ఎన్నో వైద్య రహస్యాలు తెలుసుకుని మణిప్రస్థ నగరపు రాజువద్ద రాజవైద్యుడుగా కొలువు కుదిరాడు. రాజభూషణుడు వయసుకు

## బేతాళ కథలు

చిన్నవాడైనా, ఒక్క వైద్యంలోనే గాక పరాక్రమంలోకూడా తీసివేయరానివాడు.

మణిప్రస్థనగరపు రాజకుమారుడు జయభద్రుడనేవాడు చాలా పొగరుబోతు, దుర్మార్గుడు. అతను తన యీడువారిని కొందరిని జీతాలిచ్చి తనవద్ద వుంచుకుని, వారిని వెంటవేసుకుని తిరుగుతూ, అచ్చుపోసిన ఆబోతులాగా అదుపూ, ఆజ్ఞా లేకుండా అందరినీ అవమానిస్తూ, హింసిస్తూ, ఇతరుల బాధలుచూసి ఆనందిస్తూవుండేవాడు.

జయభద్రుడు రాజభూషణుడితో ఒకటి రెండుసార్లు వెటకారంగానూ, అలక్ష్యంగానూ మాట్లాడి కోపం తెప్పించాడు. కాని రాజభూషణుడు తన కోపాన్ని అణచుకుని, "మహారాజా, మనిషికి తగిన మర్యాద చూపటం నేర్చుకోండి!" అని గట్టిగా హెచ్చరించాడు.

పొగరుబోతులకు ఆత్మాభిమానం గలవారంతా పొగరుబోతులుగానే కనపడతారు గనక రాజకుమారుడికి రాజభూషణుడిపై ఆగ్రహం వచ్చింది. "ఈ రాజవైద్యుడికి ఎప్పుడో ఒకసారి బాగా బుద్ధి చెప్పాలి!" అని అతను అనుకున్నాడు. అలాటి అవకాశం ఒకరోజు రాత్రి లభించింది.

చీకటి పడిన కొంతసేపటికి జయభద్రుడూ, అతని అనుచరులలో ఒకడైన



వీరవర్మ అనే మరొక యువకుడూ ఒక వీధిన గుర్రాలెక్కి వస్తూండగా రాజభూష ణుడు గుర్రం ఎక్కి వారికి ఎదురువచ్చాడు. రాజకుమారుడు తన గుర్రాన్ని రాజభూష ణుడి గుర్రానికి అడ్డంగా నడిపి, "నీకు ఎలాటి మర్యాద చూపాలో నేర్చుకున్నాను. ఇదుగో నేనిచ్చే మర్యాద!" అంటూ ఒర నుంచి కత్తి దూశాడు.

రాజభూషణుడుకూడా కత్తి దూయక తప్పింది కాదు.

ఇద్దరూ గుర్రాలు దిగి కత్తి యుద్ధానికి తలపడ్డారు. రాజకుమారుడి అనుచరుడు వీరవర్మకూడా గుర్రం దిగి, కత్తి దూసి, రాజకుమారుడి ఆజ్ఞకోసం ఎదురు చూస్తూ దగ్గరలో నిలబడ్డాడు.

జయభద్రుడికి మాటలలో ఉన్న పౌరుషం చేతిలో లేదు. రాజభూషణుడు కత్తి ఎత్తి అతని నెత్తిన ఒక్కటి పెట్ట బోతూండగా వీరవర్మ అడ్డు వెళ్లాడు. మరు క్షణం వీరవర్మ తల రెండుగా తెగిపోయింది. ఈ సందులో జయభద్రుడు గుర్రమెక్కి పారిపోయాడు.

తానిక ఆ రాజ్యంలో ఉండటం క్షేమం కాదని రాజభూషణుడు గ్రహించి, తన గుర్రం ఎక్కి నగరం విడిచి పారిపోయాడు. తెల్లవారేలోపుగా రాజ్యం వదిలిపోతే అతనికి





ఏభయమూ లేదు. అందుకని అతను తెల్లవార్లూ గుర్రాన్ని అతి వేగంగా తోలాడు. కాని అతను రాజ్యపు సరిహద్దు దాటే లోపుగానే తెల్లవారిపోయింది.

గుర్రం డస్సి ఉన్నది, రాజభూషణుడు డస్సి ఉన్నాడు. ఇద్దరికీ నిద్రాహారాలు లేవు. అతనికి తెల్లవారాక ఒక గ్రామం తగిలింది.

ఆ పగలల్లా ఎవరి ఇంటనైనా విశ్రాంతి తీసుకుని రాత్రి చీకటి పడగానే మళ్లీ ప్రయాణం సాగింతామని రాజభూషణుడు నిశ్చయించుకుని గ్రామంలోకి వెళ్లాడు.

శత్రుంజయవర్మ అనే ఆయన ఇంట రాజభూషణుడికి ఆశ్రయం దొరికింది.



శత్రుంజయుడు వృద్ధుడు. ఆయన గొప్ప ధనికుడు కాడుగాని వారిది గొప్ప వంశం. ఆయన అల్లుడు ఆ గ్రామానికి అధికారి. ఆయన కొడుకే వీరవర్మ. వీరవర్మ మరణవార్త ఇంకా ఈ గ్రామానికి చేరలేదు. తన కొడుకును చంపినవాడికే తాను ఆశ్రయమిచ్చానని శత్రుంజయుడికి తెలియదు; తనకు ఆతిథ్యమిచ్చిన వృద్ధుడు తన చేత చచ్చిన యువకుడి తండ్రి అన్న సంగతి రాజభూషణుడికీ తెలియదు.

రాజభూషణుడు పగలల్లా విశ్రాంతి తీసుకున్నాడు. ఆ సాయంకాలం అతను శత్రుంజయుడితో కబుర్లు మాట్లాడుకునే సమయంలో రాజభూషణుడికి నిజం తెలిసింది. ఈ శత్రుంజయుడి కొడుకే తన చేత చచ్చిపోయాడనీ, ఆయననుంచి తాను ఆతిథ్యం పొందాననీ తెలియగానే రాజభూషణుడికి పశ్చాత్తాపమూ, భయమూ ఒక్కసారిగా కలిగాయి. ఇక తానా గ్రామంలో ఉండటం క్షేమం కాదు. వీరవర్మ మరణవార్త ఈ గ్రామానికి వచ్చి తీరుతుంది, తనను ముసలాయన తప్పక శిక్షిస్తాడు. ఆయన అల్లుడే గ్రామాధికారికూడానూ.

అందుచేత రాజభూషణుడు లేచి నిలబడి, "ఇక నాకు సెలవిప్పించండి. మీ



ధర్మాన నేనూ, నా గుర్రమూ ప్రయాణపు బడలికనుంచి తేరుకున్నాం. నేనింకా చాలా దూరం వెళ్ళాలి!" అన్నాడు.

శత్రుంజయుడు, "అదేం, నాయనా? కొద్దిఘడియలలో చీకటి పడబోతోందిగదా, రేపు వెళ్ళరాదా?" అన్నాడు.

"లేదు లెండి. నాకు రాత్రిప్రయాణం అలవాటే!" అంటూ రాజభూషణుడు ప్రయాణసన్నద్ధుడయాడు. ఇంతలో శత్రుంజయుడి అల్లుడి నౌకరు వచ్చి, "బాబూ, అమ్మగారికి అకాలంగా నొప్పులు ఆరంభమయాయి! ఆమె స్పృహతప్పి పడిపోయారు! వైద్యుడు తనవల్ల కాదంటున్నాడు. పెద్దవైద్యుల నెవరినన్నా పిలిపించాలట. ఏం సెలవు?" అన్నాడు.

తన కుమార్తె ప్రాణాపాయస్థితిలో ఉందని తెలియగానే శత్రుంజయుడి ప్రాణం తటతటా కొట్టుకున్నది. ఒక చెంప చీకటి పడబోతున్నది. మంచి వైద్యులను రప్పించాలంటే మణిప్రస్థానికి కబురు పంపాలి.

ఆయన పడుతున్న ఆందోళన చూసి రాజభూషణుడు తన ప్రయాణోద్దేశం మార్చుకుని, "తమకు అభ్యంతరం లేకపోతే రోగిని నేను చూస్తాను. నేను ఘనవైద్యుణ్ణే, నాది మణిప్రస్థమే!" అని శత్రుంజయుడితో అన్నాడు.



శత్రుంజయుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆయన రాజభూషణుణ్ణి వెంటబెట్టుకుని తన కుమార్తె ఇంటికి వెళ్ళాడు. రాజభూషణుడు రోగిని చూసి, నాడి పరీక్షించి, "నేను రావటం చాలా మంచిదయింది. ఈమె చాలా ప్రమాదస్థితిలో ఉన్నది. అయితే ఆమె ప్రాణాన్ని నేను కాపాడగలను. బహుశా తెల్లవారేలోగా ప్రసవంకూడా అయిపోతుంది! రెండు ప్రాణాలూ దక్కేలాగు చూస్తాను. మీరేమీ అధైర్యపడకండి," అన్నాడు.

అర్ధరాత్రి దాటినాక మణిప్రస్థం నుంచి గ్రామాధికారికి రాజుగారి నుంచి తాఖీదు

వచ్చింది. "గడచిన రాత్రి రాజవైద్యుడైన రాజభూషణుడనేవాడు రాజకుమారుడైన జయభద్రుడిపైనా, అతనివెంట ఉన్న వీర వర్మపైనా అకారణంగా కత్తి దూసి, వీర వర్మను చంపి, పరారీ అయిపోయాడు. ఆ రాజద్రోహి మీ పరిసర గ్రామాలకేసి వచ్చే పక్షంలో పట్టుకుని, విచారించి మరణ దండన విధించేది!" అని రాజాజ్ఞ.

తన కొడుకు మరణవార్త వినగానే మొదట శత్రుంజయుడు కుప్పన కూలి పోయాడు. ఆయనకు వీరవర్మ ఒకడే కుమారుడు. వాడే బతికి బాగుపడి, తన కీర్తినీ, వంశాన్నీ నిలబెడతాడని శత్రుం జయుడు కలలు కన్నాడు. ఆ కలలన్నీ ఒక్కసారిగా విచ్చిపోయాయి.

ఆ దుఃఖంలో అకస్మాత్తుగా ఆయనకు తన అతిథి జ్ఞాపకం వచ్చాడు. ఆ అతిథి తన పేరు చెప్పలేదుగాని, మిగిలిన విష యాలన్నీ రాజద్రోహికి సరిపోతున్నాయి. అతనిది మణిప్రస్థం. అతను ఘనవైద్యుడు. రాత్రి ప్రయాణంచేసి తెల్లవారి తన గ్రామం చేరాడు. అతనే రాజభూషణుడనీ, తన ఏకైక పుత్రుణ్ణి హత్యచేసినవాడనీ శత్రుం జయుడికి స్పష్టమయింది.

తన కడుపులో చిచ్చుపెట్టిన ఈ దుర్మా ర్గుణ్ణి తన చేతులతోనే చంపి పగ తీర్చు



కోవాలనిపించింది వృద్ధుడికి. ఆయన ఎవరి తోనూ ఒక్క మాటకూడా అనక ఇంటి లోపలికి పరిగెత్తాడు. ఒకచోట ఆయనకు ఒక గండ్రగొడ్డలి దొరికింది. దాన్ని చేత బట్టుకుని ఆయన తన కూతురున్న గది లోకి దఢాలున ప్రవేశించాడు. ఆయన కుమార్తె మంచంపై పడుకుని వున్నది. రాజభూషణుడు కొంచెం ఇవతలగా నిలబడి చేతిలో ఏదో పట్టుకునివున్నాడు.

"రాజభూషణా!" అని శత్రుంజయుడు గట్టిగా అరిచాడు.

రాజభూషణుడు వెనక్కు తిరిగిచూశాడు. శత్రుంజయుడికి అనుమానం యేదన్నా మిగిలివుంటే అ కాస్తా తీరిపోయింది. కాని ఆక్షణంలోనే ఆయనకు రాజభూషణుడి చేతిలో వున్న పసికందు కనిపించాడు.

"అయ్యా, నాపని సక్రమంగా నెరవేరింది. మీ కుమార్తెకుగాని ఈ బిడ్డకుగాని ఇక ఏ అపాయమూ లేదు!" అన్నాడు రాజభూషణుడు.

శత్రుంజయుడి చేతినుంచి గండ్రగొడ్డలి జారి కింద పడిపోయింది.

"బాబూ, నీకీఇంట చాలాపెద్ద అపాయం రానున్నది. నువు వెంటనే బయలుదేరి నీదారిన వెళ్లిపో!" అన్నాడు శత్రుంజయుడు గద్గద కంఠంతో.





రాజభూషణుడు జరిగిన సంగతి గ్రహించాడు. అతడు అప్పుడే బయలుదేరి తిరిగి తెల్లవారేలోపుగా ఆ రాజ్యం దాటిపోయి మరొక రాజ్యం చేరి, అక్కడ నివాసం ఏర్పరచుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. రాజభూషణుడు తాను శత్రువుల ఇంట ఆతిథ్యం పొందానని తెలిసినాకకూడా శత్రుంజయుడి కుమార్తెకు వైద్యంచేస్తూ ఎందుకు నిలిచిపోయాడు? తన ప్రాణాన్ని కాపాడుకునేటందుకు మణిప్రస్థం నుంచి పారిపోయి వచ్చినవాడు శత్రుంజయుడి నుంచి పారిపోకపోవటంలో అర్థమేమిటి? అది అలా వుంచి, శత్రుంజయుడు గండ్రగొడ్డలితో తన చేజిక్కిన శత్రువు తల పగలగొట్టటానికి బదులు అతణ్ణి హెచ్చరించి పంపటానికి కారణమేమిటి? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది," అన్నాడు.

"రాజభూషణుడికి ప్రాణంమీద ఆశ వున్నప్పటికీ ఆ ప్రాణాన్ని కాపాడుకునేటందుకు తన వైద్యధర్మాన్ని విడిచిపెట్టేవాడు కాడు. శత్రుంజయుడి కుమార్తె ప్రాణాన్ని కాపాడటంలో అతను అతిథి ధర్మాన్నికూడా పాటించాడు. ఇక, శత్రుంజయుడు తన కుమారుణ్ణి రాజభూషణుడి మూలాన పోగొట్టుకున్నప్పటికీ, అతని మూలంగానే తన కూతురు ప్రాణాన్ని కాపాడుకున్నాడు, మనవణ్ణికూడా కళ్ళజూశాడు. రెండు ప్రాణాలను కాపాడగలందులకు రాజభూషణుడు తనప్రాణాన్ని ఒడ్డాడనీ, పారిపోయే అవకాశాన్నికూడా విడిచిపుచ్చాడనీ గ్రహించి శత్రుంజయుడు అతన్ని చంపలేక పోయాడు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






## 16

[ఇరవై ఏళ్లకు స్వదేశానికి తిరిగివచ్చిన రూపధరుడు తన ఇంట్లో అడుగు పెట్టటానికి ఒక ముసలి బిచ్చగాడి రూపం ధరించవలిసి వచ్చింది. అతని రహస్యం అతని కుమారుడైన ధీరమతికి ఒక్కడికే తెలుసు. రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడే ఉద్దేశంతో అతని ఇంట చేరి అతని ఆస్తిని తిని తాగేస్తున్న దుర్మార్గులు ఈ ముసలి బిచ్చగాణ్ణి ఎంతో అవమానించారు. కాని రూపధరుడు దానిని సహించి ప్రతీకారం కోసం వేచివున్నాడు. ఆ రాత్రి అందరూ వెళ్లిపోయి హాలులో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు.]

రూపధరుడు ధీరమతికేసి తిరిగి, "నాయనా, గోడలమీద ఉన్న ఆయుధాలన్నీ తీసి సామాన్లగదిలో దాచెయ్యి. అవి ఏమయాయని ఎవరైనా అడిగితే, దాచానని చెప్పు," అన్నాడు.

ధీరమతి తన తల్లివద్ద ఉన్న దాసీలలో పెద్దదయిన బహుకీర్తి అనే ఆమెను పిలిచి, "నానమ్మా, దాసీలందరినీ తమ గదులలోకి వెళ్లి తలుపులు వేసుకోమను. మా నాన్న వెళ్లిపోయాక ఈ అయుధాలకేసి చూసిన వారు లేరు. ఇవి చూడు ఎలా బూజుపట్టి పోయాయో! పెద్దవాణ్ణయాను గనక వాటిని కాపాడే బాధ్యత ఇక నాదేగా!" అన్నాడు.

"నాతండ్రి! ఇంటి పెత్తనమంతా నువే తీసుకో, బాబూ!" అన్నది బహుకీర్తి. ఈ ముసలిది చిన్నతనంలో రూపధరుడికి దాది.



ఆమె వెళ్లిపోగానే రూపధరుడూ, ధీరమతీ లేచి గోడలకు తగిలించిఉన్న డాళ్లూ, శిరస్త్రాణాలూ, ఈటెలూ తీసి సామాన్లగదికి చేరవేశారు. ఈ పని ముగిసినాక రూపధరుణ్ణి హాలులో వదిలేసి ధీరమతి తన పడకగదికి వెళ్లిపోయాడు.

కొద్దిసేపట్లో పద్మముఖి దిగివచ్చి హాలులో ఒక అసనం పైన కూర్చున్నది. దాసీలు చలి కుంపట్లలో కొత్తకట్టెలు వేసి మంటలు చేశారు. ఒక దాసీ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, ముసలాడా? తిన్నది చాలలేదా?" అని అవమానంగా మాట్లాడింది.



"బుద్ధితక్కువదానా, ఏమిటా పేలాపన? నేనీయనతో మాట్లాడబోతున్నానని తెలిసి కూడా ఎందుకలా నోరు పారేసుకుంటు న్నావు?" అని ఆ దాసీని మందలిస్తూ పద్మ ముఖి రూపధరుడికోసం తన ఎదురుగా ఒక కుర్చీ వేయించింది. రూపధరుడు అందులో కూచున్నాక అమె, "అయ్యా, నువ్వెవరవు? మీది ఏ దేశం? మీ కులగోత్రాలేమిటి?" అని అడిగింది.

రూపధరుడు ఆమెకు తననుగురించి ఏదో ఒక కట్టుకథ చెప్పి, తన దేశం సిసిలీ అనీ, యుద్ధానికి బయలుదేరి వెళ్ళేటప్పుడు రూపధరుడు తన ఇంటికి వచ్చి అతిథిగా ఉన్నాడనీ చెప్పాడు. అమెకు నమ్మకం కుదిరేలాగ అతను రూపధరుడు అప్పుడు ధరించి ఉన్న దుస్తులనూ, అతని సేవకులనూ వివరించాడు. ఆ దుస్తులు పద్మ ముఖి తన భర్తకు ప్రయాణసమయంలో ఇచ్చినవే. ఆ వర్ణన వింటుంటే పద్మముఖికి దుఃఖం ఆగలేదు. ఆమెకు ఈ ముసలి బిచ్చగాడి మాటలో చాలా గురి కుదిరింది.

ఆమె బహుకీర్తిని పిలిచి, "ఈ అతిథి మీ యజమానికి స్నేహితుడు. ఈయనకు కాళ్ళు కడుగు," అన్నది. బహుకీర్తి ఒక పెద్ద గిన్నెలో వేడినీళ్ళూ, చన్నీళ్ళూ పాళా







లుగా కలిపి తీసుకువచ్చి అతిథికి కాళ్ళు కడగ నారంభించింది. రూపధరుడు తన బట్టను మోకాళ్ళపైకి తీశాడు. అతని కాలిపై ఉన్న మచ్చ బహుకీర్తికి కనిపించింది. ఆమె రూపధరుణ్ణి గుర్తించింది. ఆమె చేతిలో ఉన్న నీటిగిన్నె దభీమని కింద పడి నీరంతా ఒలికిపోయింది. ఆమె అరవటానికి నోరు తెరిచింది, కాని రూపధరుడు చప్పున ఆమె నోరుమూసి, "నానమ్మా, నా రహస్యం బయటపెట్టి నన్ను నాశనం చెయ్యకు ఇరవైఏళ్లు అష్టకష్టాలూ పడి ఇంటికి చేరుకున్నాను. ఇంకా కొద్దికష్టాలు మిగిలి ఉన్నాయి. అవి గడిచినదాకా నా రహస్యం కాపాడు," అన్నాడు రహస్యంగా.

బహుకీర్తి ఇందుకు సమ్మతించి మళ్లీ నీరు తీసుకురాబోయింది.

ఆమె చూసి గుర్తించిన గాయం రూపధరుడికి చిన్నతనంలో ఈ విధంగా కలిగింది: అతను కుర్రవాడై ఉండగా కట్నకానుక లిస్తామని అతని మేనమామలు పిలిపించారు. ఒకరోజు రూపధరుడు తన తాతగారితోనూ, మేనమామలతోనూ వేటకు వెళ్లి అందరికన్న ముందుగా ఒక అడవిపందిని చూసి దాన్ని వేటాడి చంపేశాడు. అయితే అతని ఈటెదెబ్బ తగిలి చచ్చేలోపల ఆ పంది రూపధరుణ్ణి తన కొమ్ముతో కోరింది. ఆ గాయం మాని మచ్చపడింది.

బహుకీర్తి తన యజమానిని గుర్తించటం పద్మముఖికి తెలియదు. రూపధరుడు కాళ్లు కడగటం పూర్తి అయి తిరిగిరాగానే ఆమె అతనితో, "అయ్యా, నాకొక గడ్డుసమస్య వచ్చిపడింది. ఇదివరకల్లా నా కొడుకు పసివాడు, నా కొంగు పట్టుకుని వదలలేదు. అందుచేత నేను మళ్లీ పెళ్లాడి ఈ ఇంట్లో నుంచి వెళ్లిపోవలిసిన అవసరం లేకపోయింది. ఇప్పుడు వాడు పెద్దవాడయ్యాడు. వాడి కిప్పుడు నాకన్నకూడా వాడి ఆస్తి ముఖ్యం. నన్ను స్వయంవరం చేసుకోమని






నిర్బంధించే ఈ రాజకుమారులు తన సొత్తంతా తినేస్తూ ఉండటం వాణ్ణి చాలా బాధిస్తున్నది. కనక నేను పెళ్లిచేసుకు తీరాలి. ఇందుకు ఒక ఉపాయం ఆలోచించాను. నా భర్త పన్నెండు గొడ్డలితలలు బారుగా పెట్టి వాటన్నిటినుంచీ దూసుకు పోయేలాగా బాణం వేసేవాడు. నా భర్త బాణం ఎక్కుపెట్టి, పన్నెండు గొడ్డలితలల కుండా బాణం వెసినవాణ్ణి పెళ్లాడదామని నాలోనేను నిశ్చయించుకున్నాను!" అన్నది.

తరవాత ఆమె తన గదికి వెళ్లిపోయి పడుకున్నది. రూపధరుడు హాలు ముందు భాగంలో ఎద్దుచర్మంమీద గొర్రెతోళ్లు



పరుచుకుని పడుకున్నాడు. అతనికి నిద్ర రాలేదు. తెల్లవార్లూ అతను ప్రతీకారం గురించి ఆలోచించి తెల్లవారగానే తన పక్క తోళ్ళు చుట్టిపెట్టి, దేవుణ్ణి ప్రార్థించాడు.

తెల్లవారగానే ఎవరి పనులమీద వారు బయలుదేరారు. పందులకాపరి మూడు బలిసిన పందులు తోలుకువచ్చాడు. అతను రూపధరుణ్ణి చూసి, "ఇక్కడ చేరిన మూక నిన్ను సరిగా చూస్తున్నారా, బాబూ? లేక వారి బుద్ధి పోనివ్వటంలేదా?" అని అడిగాడు.

"వాళ్ళకు కాస్తయినా అభిమానం లేదు. ఇంకొకరి ఇంట చేరి ఇలా ప్రవర్తించే నీచులను దైవం తప్పక శిక్షిస్తాడు!" అన్నాడు రూపధరుడు.

వారు మాట్లాడుతుండగా గొర్రెలకాపరి కాళుడు వచ్చాడు. తన కొత్తయజమానులు కోసుకు తినగలందులకు వాడు బలిసిన మేకలనూ, మేకపిల్లలనూ తెచ్చాడు వాడు వాటిని బయట కట్టివేస్తూ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, అడుక్కు తినేవాడా? అడుక్కోవటానికి ఇంత నగరంలో నీకు మరే ఇల్లూ కనబడ లేదూ?" అన్నాడు. రూపధరుడు ఈ మాటలకు జవాబు చెప్పలేదు. అతని కోపాగ్ని రగులుతున్నది.








ఇంతలో అక్కడికి సుఖప్రాప్తి అనే పశువులకాపరి ఒక పాడి ఆవునూ, కొన్ని మేకలనూ వెంటపెట్టుకని వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి ఆయన ఎవరు, ఏ దేశస్థుడని పందులకాపరిని అడిగాడు. ఏమంటే ఆ ముసలి బిచ్చగాడి అవతారం చూస్తూనే వాడికి తన యజమాని గుర్తుకొచ్చాడు, వాడి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. "అయ్యో, మా యజమానికూడా నీలాగే కుళ్ళుగుడ్డలు కట్టుకుని ఎక్కడన్నా దిక్కులేకుండా తిరుగుతున్నాడేమో! ఆ మహారాజు ఎప్పటికైనా తిరిగి రాకుండా పోతాడా అన్న ఆశతో ఇంకా ఇక్కడ ఉన్నానేగాని, లేకపోతే ఈ తిండిపోతుల కొలువు ఒక్కనాటికి చేసేవాణ్ణా?" అన్నాడు వాడు రూపధరుడితో.

రూపధరుడు వాడితో, "నువు బుద్ధిమంతుడిలాగా కనబడుతున్నావు. భయపడకు. నువ్విక్కడ ఉండగానే మీ యజమాని తిరిగి వచ్చి వీళ్ళందరినీ మట్టుబెడతాడు," అన్నాడు.

"అంత పనే జరగాలిగాని నా చేతులూరుకుంటాయా?" అన్నాడు సుఖప్రాప్తి.

సరిగా ఇదే సమయాన దుర్మార్గులు ధీరమతిని హత్యచేయటానికి ఒక పథకం ఆలోచిస్తున్నారు. మధ్యలో ఒకడు, "అన్నలారా, అపశకునాలు కనబడుతున్నాయి. ఈ పథకం పనిచెయ్యదు. ధీరమతి హత్యసంగతి తరవాత చూడవచ్చు, భోజనాలకు పోదాం పదండి!" అన్నాడు. అందరూ లేచి హాలులోకి వచ్చారు. కొందరు పశువులను కోసి నిప్పుమీద కాల్చసాగారు. రొట్టెలూ, పానీయాలూ వచ్చాయి. అందరూ తినటానికి ఉపక్రమించారు.

వాకిలికి పక్కగా ధీరమతి రూపధరుడికి ఒక పాత కుర్చీ, బల్లా వేయించాడు. అతను తన తండ్రి ముందు ఆహారమూ, పానీయమూ పెట్టించి, "సుఖంగా భోజనం చెయ్యి. నిన్ను ఎవరూ అవమానించకుండా





చూస్తాను. ఇది నడివీధి కాదు, నా తండ్రి ఇల్లు, ఇప్పుడు నా ఆస్తి. అందరూ బుద్ధిగా మసులుకోమని మనవి చేస్తున్నాను. లేక పోతే నే నూరుకోను!" అని గట్టిగా అన్నాడు.

ఈ మాటలు విని అందరూ ఆశ్చర్య పోయారు. దుర్బుద్ధి తన మిత్రులకేసి చూసి, "వాడి బెదిరింపు విన్నారా? ఇవాళ వాడికి మంచి రోజు. మనకు అపశకునాలు జరగకపోయినట్టయితే ఈపాటికి వాడి నోరు మూసేవాళ్ళం!" అన్నాడు. ఈ మాటలు ధీరమతి విన్నాడుగాని, లక్ష్యపెట్టలేదు.

ఆ దుర్మార్గులలో అశ్వనిపుణుడు అని పొగరుబోతున్నాడు. ఏడు చాలా స్థితిపరుడు. పద్మముఖి తన సంపద చూసి తనను పెళ్ళాడుతుందన్న ఆశతో వీడు దూర ప్రాంతంనుంచి వచ్చాడు. వాడిప్పుడు తన అనుచరులతో, "అబ్బాయిలూ, ఒక్కమాట ఆలకించండి. ఈ ముసలిబిచ్చగాడు మనతో సమంగా కూచుని తింటూ, తాగుతున్నాడుగదా. కాని వీణ్ణి ఇంకొక మెట్టు పైకి పంపిద్దాం. వీడికి నేనిచ్చే బహుమానం చూడండి," అంటూ ఒక ఆవు గిట్టల జోడు తీసి రూపధరుడి తలకేసి విసిరాడు. రూపధరుడు తలను పక్కకు తిప్పి దెబ్బ తప్పించుకున్నాడు.

ధీరమతి కోపంగానూ వ్యంగ్యంగానూ మాట్లాడుతూ, "అశ్వనిపుణుడా, చాలా గురిగా గురితప్పావు! కాని మన అతిథి తలను పక్కకు తిప్పుకోవటం చూశాను. అతని తలకు దెబ్బే తగిలి ఉంటే నా బల్లెం నీ గుండెలను గుచ్చి ఉండేది. నేనిదే చెబుతున్నాను, మీరు బుద్ధిగా మసులుకోండి. నేను గ్రాహకం వచ్చినవాణ్ణి. మీరిలా విచ్చలవిడిగా నా పశువులను కోసుకు తినటమూ, చెడతాగి తందనాలు వేయటమూ నేను సహించను," అన్నాడు.

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. చివరకు ఒకడు, "మిత్రులారా, ఆ బిచ్చగాడి



జోలికి పోకండి. ధీరమతీ, మేము కోరేదల్లా ఒకటే: మీ అమ్మ స్వయంవరం. అది జరిగితే మాకిక్కడ ఏమీ పనిలేదు. అవిడ దేనికోసం ఎదురుచూస్తున్నది? మాలో ఒకరిని ఎందుకు పెళ్లాడదు?" అన్నాడు.

వాకిలికెదురుగా ఆసనం వేసుకుని కూచుని ఉన్న పద్మముఖి ఈ సంభాషణ అంతా విన్నది. ఆమె లేచివెళ్లి తన భర్త తాలూకు వస్తువులుండే గది తలుపు తాళం తెరిచింది. ఆ గదిలో రూపధరుడి ధనుస్సూ, అంబులపొదీ ఉన్నాయి. ఈ ధనుస్సును రూపధరుడికి ఎవరో బహుమానంగా ఇచ్చారు. యుద్ధానికి బయలుదేరేటప్పుడు రూపధరుడు దానిని వెంట తీసుకుపోలేదు. పద్మముఖి ఆ ధనుస్సును కాస్సేపు తన ఒడిలో పెట్టుకుని ఏడ్చింది. తరవాత ఆమె కళ్లు తుడుచుకుని ధనుస్సునూ, అంబుల పొదినీ తీసుకుని కిందికి దిగివచ్చింది. నౌకర్లు గొడ్డలి తలలను ఒక పళ్ళెంలో పేర్చి ఆమె వెనకనే తెచ్చారు.

పద్మముఖి హాలుద్వారంలో నిలబడి తన చెంపకు మేలిముసుగు అడ్డంగా పెట్టుకుని ఇలా అన్నది:

"అందరూ శ్రద్ధగా వినాలి. మీరందరూ నన్ను పెళ్ళాడ వచ్చి, మా ఇంటికి ముట్టడి




వేసి, మా సొత్తంతా తింటున్నారు. తాగుతున్నారు. నన్ను పెళ్ళాడగోరటం తప్ప మీ అర్హత ఏమిటో మీలో ఒక్కరుకూడా బయట పెట్టలేకపోయారు. మీ అర్హత ప్రదర్శించి నన్ను బహుమానంగా పొందండి. ఇదుగో నా భర్త ధనుస్సు. మీలో ఎవరు ఈ ధనుస్సుకు తాడు తగిలించి, బాణం ఎక్కుపెట్టి ఈ పన్నెండు గొడ్డలి తలల గుండా బాణాన్ని వేస్తారో వారిని నేను పెళ్ళాడతాను."

ఈ మాట చెప్పి ఆమె పందులకాపరిని పిలిచి, అతని చేతికి ధనుస్సూ, గొడ్డలి తలలూ ఇచ్చి, వాటిని అందరికీ చూప





మన్నది. వాటిని చేతిలోకి తీసుకుంటూ పందులకాపరి కంట తడి పెట్టుకున్నాడు. దూరాన నిలబడి చూస్తున్న సుఖప్రాప్తికి కూడా దుఃఖం ఆగలేదు. దుర్బుద్ధి వారిద్దరినీ చూసి వెటకారంగా, "అడముండల్లాగా అలా ఏడుస్తారేం? తిండానా కూచుని తిండి తినండి. ఏడవదలిస్తే బయటికి పోయి ఏడవండి! మా కిక్కడ గట్టిపని పడింది. ఎందుకంటే ఈ విల్లు వంచటం అంత తేలికపని అనుకోను రూపధరుడివంటి . బలశాలి ఇక్కడ ఎవరూ లేరు. నేను చిన్నతనంలో ఆయనను చూసేవాణ్ణి! ఆయన బలం నాకు తెలుసు," అన్నాడు.

అతను పైకి అలా అన్నాడేగాని, తానా విల్లును వంచి, తాడు తగిలించి, బాణం గొడ్డలి తలలకుండా దూసుకుపోయేటట్టు కొట్టగలనన్న ధైర్యం అతనికున్నది.

ధీరమతికి ఒక్కసారిగా వెర్రిఆవేశం వచ్చినట్టయింది. "ఓహో, మా అమ్మ పెళ్లాడి అత్తవారింటికి వెళ్ళేసమయం వచ్చింది! అది చూసి నేను వెర్రివాడికిమల్లె ఆనందిస్తున్నాను. మా అమ్మలాటిది భూప్రపంచంలో ఎక్కడా లేదు. కాని ఆ మాట నేను అని ఏం లాభం? ఏదీ, మా నాన్న ధనుస్సు నేను ఎక్కుపెట్టగలనేమో చూస్తాను!" అంటూ అతను లేచి గొడ్డలి తలలను అతి చాకచక్యంతో ఒక సోల్పులో అమర్చి తరవాత ధనుస్సును నిలువుగా నేల మీద నిలబెట్టి, దానికి తాడుతగిలించటానికి మూడుప్రయత్నాలు చేశాడు. ఇంకా గట్టిగా ప్రయత్నిస్తే తాడు తగులుకుంటుందని అతనికి తోచిందిగాని, రూపధరుడు ప్రయత్నించవద్దని అతనికి కళ్ళతో హెచ్చరిక చేశాడు. అతను విరమిస్తూ, "ఎబ్బే, నేను వట్టి అర్భకుణ్ణి, ఎందుకూ పనికిరాను. లేక నాకు ఆయుం చాలదేమో! పెద్దలంతా ఉన్నారు గదా, మీ బలపరాక్రమాలు ప్రదర్శించండి, చూస్తాను!" అన్నాడు. —(ఇంకా ఉంది)





# కాకోలూకీయం

అరిమర్దనుడు (గూబరాజు):
పలుకు నీ భావమ్ము - ప్రాకారకర్ణ
చలపడి చంపుటా - సత్కరించుటయ?

ప్రాకారకర్ణుడనే మంత్రి:
చంపుట సరికాదు - సత్కరించుటయె
పెంపగు; శత్రులు - భేదింపబడిరి.
స్థిరజీవి మర్మమ్ము - చెప్పెను మనకు
మఱి వీని మర్మమ్ము - మనమెఱుంగుదుము.
వీనితో శత్రుల - వేధించవచ్చు
దీనికి కథ కల - దే నిదే వింతు:
రాకుమారుని ఉద-రమ్ములో నొక్క
మోకు బోలిన పాము - మును చేరుకొనియె
చాకులాగున్నట్టి - చక్కనివాడు
ఏకులా గయిపోయె - ఈ బాధతోడ.
ఎన్నెన్ని వైద్యాలు - ఏమి చేసినను
తిన్నది అరుగక - తిప్పలు వడుచు
రాజ్యమే విడనాడి - రాకుమారకుడు
పూజ్యత గోల్పోయి - పొక్కుచు దిరిగి
ఒక ఊరి సత్రమ్ము - నందు నిద్రించె
సుకమన్నదే వాడు - చూడనే లేదు.
ఆ పురరాజున - కాత్మజల్ గలరు
కాపురమ్మును సేయు-గల మంచి వయసు.
ఇద్దఱు కూతులా - యినతేజు జేరి
ఒద్దికతో మ్రొక్కి - రొక ఉదయాన
"మీ దయతో సుఖ - మ్మిదె మాకటంచు"
సోదె జెప్పె నొకర్తె - చొక్కె నారాజు.
"హితమిత భోజన-మ్మే కొనుడంచు"
జతబిడ్డ అనె, రాజు - కుతకుత ఉడికె.
పొగరు పట్టినదంచు - పొమ్ము హితమ్మ
తగినంత తిండియే - తనయ నీకంచు
ఏ విదేశీయున-కో వెలందుకను
దీవించి యిండని - దీర్ఘకోపమున
రాజు మంత్రికి జెప్ప - రాకుమారికను
ఆ జాడ్యమున్న రా-జాత్మజు కిచ్చె.
రాకన్నె వాని భ-ర్తగ గ్రహియించి
చీకాకు వడక ఆ - చెడు పురి వీడి

విద్వాన్ విశ్వం



సతి పతి దేశాల - సంచరించుచును
సతతము సంతోష-సమ్మగ్నులైరి.
ఒకనాడు రాకుమా-రకు, నొక ఊరి
మొకమున కోనేటి - మొగనుండజేసి
సతి ఊరిలోనికి - సాగిపోయినది
పతి అట పుట్టపై - పడుకొనికూర్కె
వాని పొట్టను గల - పాము గాలికయి
పైనికి వచ్చి చొ-ప్పడ నిల్చియుండ.
అ పుట్టలో నున్న - అవతలి పాము
ఈ పాము జూచి యెం-తే కోపపడియె.
"ఓరి దుష్టుడ సుకు-మారుని లోన
దూరి ఏడ్పింతువే - థూ పాడుబతుకు"
అనినంత లోపలి - ఆ నర్పమనియె

"చను మూఢుడా గొప్ప - సత్యవంతుడవు
పుట్టలో బంగారు - పారలు కుంభములు
పెట్టుక వానిని - పెఱకవు తినవు"
అ మాట కలిగి "వైద్యము నీకు గలదు
ఈ మాత్ర జీరకం - బిన్ని ఆవాలు
కలిపి తాపించిన - కడుపున నుండి
వెలివచ్చి చత్తువే - వేమాట లేల?"
అని పుట్ట పామన - ఆ లోని పాము
అనె "వేడి నూనెయో - కనవేడి నీళ్ళొ
నీ పుట్ట బోసిన - నీవు చచ్చెదవు
దాపుడు ధనమెల్ల - దక్కు వారలకు"
ఇటు పాములవి రెండు - నెదిరి మర్మమ్ము
పుటుకున వెలివెట్టు - పుణ్యకాలమున
ఊరిలో కేగిన - ఉవిదయు వచ్చి
పూరిమాటున నిల్చి - పూర్తిగా వినియె.
మందిచ్చి రోగమ్ము - మాన్చెను పతికి
క్రందుగ పుట్టలో-గల ధన మందె.
కావున నీకాకి - కాకభూపాలు
లోవెల్తులను జెప్పు - దేవర మనకు.

* * *

అ మాటలకు రాజు - ఔదల యూచె
ఏమేమొ రక్తాక్షు - డెంత కాదన్న.
సరియన్న సరియని - స్థిరజీవి గొంచు
గిరిగుహ కేగుచో - మఱి యనె కాకి.



స్థిరజీవి :

మీ కోసమై బల - మ్మెల్లను పోయె
నాకేల ఈ జన్మ - నను కాల్చుడింక.
ఇకనైన గూబగా - ఏ పుట్టువంది
చకచక కాకుల - చంపగా దలతు.

రక్తాక్షుడనే గూబ మంత్రి :

వంచకుండవు మాట-వా లెఱుంగుదువు
కించ లేకిటు మమ్ము - వంచింతు వేల ?
ఎవరి జాతియె వారి - కెటులైన గొప్ప
కవగూడె కడకు ఎ-ల్కానె ఎల్కకన్నె.
రవి పొంద దలచె ఖ-ర్తగ ముందు నెలుక
తవిలె మేఘము నవ-తల గాలి జీరె
గాలి కాదన కొండ-కడ కేగె నదియు
మేలు మేలెల్కయే - మేటి నఁ గూల్చు
అనినంత కడ కెలు-కనె ఎల్కగూడె
పనిలేని మాటల వినిపింప కింక.

*    *    *

రక్తాక్షు మాటలు - రాణించ లేదు
యుక్తితో స్థిరజీవి - ఒప్పించె వారి
గూబలెల్లను కాకి - గొని తమ గుహను
దేబెలై ప్రేమతో - తినబెట్టినారు.
గవిలోన నుండుట-కై యిష్టపడక
గవి గౌనిలో నిల్చె - కాకుల మంత్రి.
పగవాని నిటు జూడ - పరితాప మంది
వగతోడ రక్తాక్షు - వర మంత్రి పలికె.
మొఱకులై వైరిని - దరిజేర్చినారు.





వెఱవెరుంగరు ఎంత - వినిపించగలను ?
ఒకకోన నొక పక్షి - యుండుచునుండె.
చకితాక్షి రెట్టయే - స్వర్ణమౌచుండె.
వని దిరుగుచు నొక్క - వ్యాధుని ముందు
పనిమాలి రెట్ట వై-చెను పిచ్చి పక్షి.
ఔర బంగార మి - ట్లందించు పక్షి
ఏ రోజు చూచితి-మే భేషటంచు
వల పన్నె నాచెట్టు-పై బోయవాడు
తెలిసియు పక్షి అం-దుల తగుల్కొనియె
పక్షిని గొనిపోయి - బంగారు పంట
కుక్షిని గలదాని - కోర్కెతో బెంచు
ఆ బోయవాడు భ-యమ్మందె తుదకు
ఈ బంగరెక్కడి-దీ అందురంచు.

భయమంది రాజు కా-పక్షి నొసంగె
స్వయముగా నారాజు - పట్టుక చూచె
అంతలో మంత్రి దే-వా స్వర్ణమిచ్చు
నంతటి పక్షి యె - ట్లగపడు మనకు
బోయమాటలు నమ్మ-కో యన్న రాజు
పోయంచు పక్షిని - పుటుకున విడిచె.
ఆ పక్షి ఱెక్కల - నల్లార్చి నిలిచి
ఆ పాలకునితోడ - ననె నిట్లు నవ్వి.
"తెలిసి బోయకు చిక్క - వల పడ్డ నేను
తొలిమూర్ఖుడను ; బోయ - దొరికిన దాని
పోనిచ్చె రెండవ - మూర్ఖుడు వాడు ;
అనక చూత మం-చైన నుండకయె
విడుమన్న మంత్రి మూ-ఢుడు మూడుసంఖ్య;
తడయక విడిచిన - ఒడయుండ వీవు
నాలుగో మూర్ఖుడు - చాలు మీరంచు"
నాలి సేయుచు పక్షి - అరిగె కానలకు

* * *

అట్టులే ఈ రాజు - అతి వైరి దెచ్చి
ఇట్టుల మన దుర్గ-మే బయల్ చేసె.
ఆపద రాకముం - దరుగంగవలయు
అపైన అనుకొని - అందున దేమి ?
అనుచు రక్తాక్షుడ-త్యాప్త మిత్రులను
తనతోడ వేఱొక - దఱికి రమ్మనియె.
అది యేమి యన వారి - కతి విశదముగ
ఇది యని ఒక కథ - నిట్లు వచించె.



# ప్రకృతి వింతలు

## 4

విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో నేనుకూడా చేపలను వేటాడాలన్న ఆలోచన తట్టింది. అందుచేత నేను కుమేవావాను వెనక వచ్చి తెడ్డు వెయ్యమని చెప్పి తెప్పముందుకు వెళ్ళాను. పట్టేదేదో పెద్ద చేపనే పట్టాలన్న ఉద్దేశంతో నేను పంట్రకోల చేత బట్టాను.

తెప్ప అటూ ఇటూ ఆడుతూ ఉండటం చేత నాకు తూకంగా నిలబడటమే సాధ్యం కాలేదు. రెండుమూడుసార్లు నీటిలో పడి నంత పని చేశాను. క్రమంగా నిలబడటం అలవాటైనాక చేప కోసం నీటిలోకి చూడ సాగాను. అనుభవంలేని నా కళ్లకు నీటి అడుగున ఉన్న ప్రతిరాయీ, ప్రతిచెట్టు బోదే చేపలాగే కనబడుతూ వచ్చింది. నీటి కదలిక మూలంగా నాకీ భ్రమ మరింత ఎక్కువ అయింది.

చిట్టచివరకు నా కంటికి నమ్మకంగా చేపలాంటిది ఒకటి తగిలింది. అది ఎడమ వైపుకు తప్పుకుపోతున్నది. తెప్పను అటుగా నడపమని కుర్రవాడికి సంజ్ఞ చేశాను. మేము దానికి సమీపంగా వచ్చాం. అది మాకు దిగువగా ఉన్నది. నేను నా నరా లన్నిటిని బిగబట్టి పంట్రకోల ఎత్తి నాకున్న బలమంతా వినియోగించి దానిపైకి విసి రాను. చేప తప్పించుకుపోతుందేమోనన్న అదుర్దాలో వెంటనే నేను కోలతాడు గట్టిగా పుచ్చుకున్నాను.

పంట్రకోల ములికి చేపలో గుచ్చుకోటం నాకు స్పష్టంగా కనబడింది. ఆ చేప రెండు గజాల నిడివి ఉన్నది. అయితే పంట్రకోల దాని శరీరానికి తగులుతూండగానే నాకు బలంగా "షాక్" తగిలి, నెత్తిమీద దెబ్బ తిన్నవాడిలాగా తెప్పలోకి పడిపోయాను.

టిబోర్ సెకెల్యీ






నేనింకా ఆ అదుటునుంచీ, ఆశ్చర్యంనుంచీ కోలుకోకముందే, కుమేవావా తనపొట్ట చేతపట్టుకుని బిగ్గరగా నవ్వుతూండటం నాకు కనబడింది.

"అది మెరుపు బుక్కడం అని న్యకు చాప్‌కు తెలియలేదల్లే ఉంది. నాకు తెలిసి కూడా చెప్పలేదు. అనుభవంద్వారా తెలుసుకోవటం మంచిది. అలా నేర్చుకున్నది ఎప్పటికీ జ్ఞాపకం ఉంటుంది," అన్నాడు వాడు.

(బుక్కడం అనేది ఒక పాములాటి చేప. ఈ చేపలలో కొన్నిటియందు విద్యుచ్ఛక్తి ఉంటుంది. వీటిని ఇంగ్లీషులో "ఎలెక్ట్రిక్ ఈల్" అంటారు)

"నువు చాలా కొంటెవాడివి, కుమేవావా. నాకు చెప్పి ఉండవలసింది," అన్నాను.

వాడు కోలతాడు అందుకుని చేపను చేద సాగాడు. ముందు పంత్రకోలా, దానివెంట సన్నటి శరీరంగల చేపా పైకి వచ్చాయి. దానినిడివి రెండుగజాలకన్న ఎక్కువే.

"నాలాగే నువుకూడా అతడి తాడును చేతపట్టుకున్నావుగదా, నాకు తగిలినట్టుగా నీకు 'షాక్' తగలలేదేం?" అని అడిగాను.

"పాపం, దాని ఒంట్లో ఉన్న మెరుపంతా న్యకుచాప్ తీసుకునేసరికి కుమేవావాకు ఏమీ మిగలలేదు," అన్నాడు కుమేవావా గట్టిగా నవ్వుతూ.

ఆ చేపను తెప్పలోకి చేర్చటం చాలా కష్టమయింది. అది తనను తాను రక్షించుకోవటానికో, లేక తెప్పను తల కిందులు చేయటానికోగాని, చాలా ప్రయాస పడింది. చిట్టచివరకది కదలటం మానేసింది. ఆ చేపను పట్టినందుకు నేను చాలా గర్వపడ్డాను. నేను పడిపోయి అవమానం పొందిన సంగతికూడా నాకు అంతగా పట్టలేదు. నేను ఇంతపెద్ద చేపను పట్టానని నా స్నేహితులతో చెబుదామనుకున్నాను.

ఈ విధంగా ఆలోచిస్తూ నేను ఆ చేప నుంచి గాలం లాగటానికి ప్రయత్నించాను.





ఆది నిష్కారణంగా బాధపడటం నాకిష్టం లేదు. చిట్టచివరకు చేప గాలంనుంచి విడి వడింది. కాని అంతలోనే ఆ చేప నన్ను తన తోకతో విసురుగా కొట్టి మా తెప్పలో నుంచి నీటిలోకి పడిపోయింది. దాన్ని మళ్లీ అందుకుందామని నేను నీటిలో చెయ్యి పెట్టే సరికి కుర్రవాడు ముందుకు దూకి నా చెయ్యి పట్టుకున్నాడు.

"చెయ్యి నీటిలో పెట్టటం ప్రమాదం, పిరన్యాలు వస్తాయి," అన్నాడు వాడు.

వాడు చెప్పినట్టుగానే కొద్దిక్షణాలలోనే కొన్ని డజన్ల పిరన్యా చేపలు వచ్చాయి. చూస్తుండగానే డజన్లు వందలయాయి. ఈ చేపలనుగురించి అదివరకు విన్నాను గాని వాటిని చూడటం ఇదే మొదటిసారి. అవి మనిషిహస్తంకన్న ఎక్కువ ఉండవు. వాటి మూతులు చాలా చిన్నవి. అయితే వాటికి సన్నని, అతివాడి అయిన పళ్ళుంటాయి. రక్తం కనపడగానే అవి వస్తాయి. రక్తం రంగుగాని వాసనగాని తగలగానే అవి బాణం వేగంతో వచ్చి, దెబ్బతిన్నది జంతువు అయేది, మనిషి అయేది కొరకనారంభిస్తాయి.

నేను పట్టిన చేపకోసం చేరిన పిరన్యాలు పందెం వేసుకున్నట్టుగా ఎగబడి నా చేపను తినసాగాయి. దాన్ని అందుకునే అత్రంలో




కొన్ని నీటిమీద ఎగిరాయికూడా. వాటివల్ల కలిగిన సంక్షోభంతో అక్కడి నీరంతా ఎర్రగా అయి నురుగులు కట్టింది. ఈ భయంకర మైన దృశ్యం ఒక్క నిమిషంలో ముగిసింది. తరవాత నీరు తేరుకున్నది. దానిపైన నా చేప తాలూకు అస్థిపంజరం తెల్లగా, పొడుగుగా, ఒక్క మాంసంనలుసుకూడా మిగలకుండా, తేలసాగింది.

"నన్ను నీటిలో చెయ్యిపెట్టకుండా ఆపి రక్షించావు, వావా. లేకపోతే అవి నన్ను ఏం చేసిఉండేవో!" అన్నాను.

"నీటిలో పిరన్యాల భయం, నేలమీదా నీటిలోనూకూడా ఇచ్చకాలాడేవాళ్ల భయం

అని మలోవాతాత అంటాడు," అన్నాడు కుమేవావా.

నేను ఆలోచనలో పడాను. ఈ అడవిలో ఎన్ని అపాయాలు! వాటినిగురించి తెలియనివాడికి అడుగడుగునా ప్రమాదమే. అక్కడ ఉండేవాళ్లు పసితనంనుంచీ వాటి నుంచి ఆత్మరక్షణ చేసుకోవటం బాగా నేర్చుకుంటారు.

"మనం తిరిగి పోదాం. పొద్దు చాలా ఎక్కింది. మీ వాళ్లు ఆకలికి మాడుతూ ఉంటారు," అన్నాడు కుర్రవాడు.

మేము నదికి ఎదురుగా తెప్పను నడపసాగాం. తెడ్డువేయటం చాలా కష్టమయింది. ఎందుకంటే మేము ఒక్క నిమిషం తెడు వెయ్యటం మానేస్తే ప్రవాహం మమ్మల్ని పదినిమిషాలు వెనక్కు లాక్కుపోతుంది.

త్వరలోనే మేము ఝరిని సమీపించాం. నీటిహోరు వినవస్తున్నది. వాలున ఎంతో చాకచక్యంతో తెప్పను నడిపిన ఆ కుర్రవాడు ఇప్పుడేంచేస్తాడో తెలుసుకోవాలనిపించింది.

"మనం కిందికి దిగి పడవను ఝరి కుండా లాగాలి," అన్నాడు వాడు.

మేము ఒడ్డున దిగి తెప్పకు తాడుకట్టి లాగసాగాం. ఇది నానుడుపని. కొంతదూరం వచ్చేసరికి ఒడ్డు ఇరుకయి చివరకు అదృశ్యమయింది. అక్కడ అడవి నీటిఅంచుదాకా విస్తరించింది. మేము నీటిలో దిగవలిసి వచ్చింది. తెప్పను లాగుతూ కుర్రవాడు ముందు పోతుంటే నేను వెనకనుంచి తెప్పను తోశాను.

వాడు తెప్పను ఒక చేత్తో మాత్రమే లాగుతూ, రెండవ చేతితో కత్తి పట్టుకుని అప్పుడప్పుడూ నీటిలోకి పొడుస్తూ ఉండటం గమనించాను. వాడక్కడ ఏదైనా పోగొట్టుకున్నాడో, లేక అలా పొడవాలన్న మూఢ విశ్వాసం ఏమైనా ఉన్నదో నా కర్థంకాలేదు. ఝరి హోరు దాటివెళ్లాక అడిగి తెలుసుకుందామనుకున్నాను. —(ఇంకా వుంది)



# తమాషాలు

1. ఒక కాలేజీ క్లాసులో ఒక బెంచీమీద కూచునే ఆరుగురు విద్యార్థులు ఒక తీర్మానం చేసుకున్నారు. అదేమిటంటే, తాము ఒకరోజు కూర్చున్న క్రమంలో మరొకరోజు కూర్చోరాదని! వారు బియ్యే మొదటి ఏడు మొదటి క్లాసులో ఈ తీర్మానం చేసుకున్నారు. బియ్యే ముగించేలోపుగా వారు మొదటిరోజు కూర్చున్న క్రమంలో ఎన్నిసార్లు మళ్ళీ కూచున్నారో ఊహించగలరా ?

2. ఈ కింది హెచ్చవేత లెక్కలో * గుర్తుగల చోట్ల ఏ సంఖ్యాలుంటాయి?

```
    * 1 *
    3 * 2
    -----
    * 3 *
  3 * 2 *
* 2 * 5
---------
1 * 8 * 3 0
```

3. 1 మొదలు 9 వరకు గల అంకెలను 11 చేత భాగించబడేలాగా అమర్చండి. అలాటి సంఖ్యలలో గరిష్ఠసంఖ్య ఏది ?

(ఏ సంఖ్యలోగాని 11 పోయేదీ లేనిదీ చూడాలంటే ఆ సంఖ్య తాలూకు సరి అంకెలూ, బేసి అంకెలూ కూడాలి. ఇలా కూడగా వచ్చిన మొత్తాలు సమంగా ఉన్నా, వాటి మధ్యగల తేడా 11 చేత సరిగా భాగించబడినా అసలు సంఖ్యలో 11 పోతుందన్న మాట.

ఉదా: (1) $121 = 11 \times 11$. సరిసంఖ్య 2; బేసి సంఖ్యలు $1+1=2$

(2) 9284 లో సరిసంఖ్యలు $2+4=6$; బేసి సంఖ్యలు $9+8=17$ తేడా 11. అందుచేత 9284 లో 11 సరిగా పోతుంది.]

[సమాధానాలు పై సంచికలో]

★ గత నెల ప్రశ్నలకు సమాధానాలు ★

(1.) గోపీ వయస్సు 18. (2.) ఇప్పుడు తండ్రి వయసు 72, కొడుకు వయసు 36.
(3.) ధనికుడి నష్టం: రు 77,37,418=23 న. పై.



# వదలని చెప్పులు

ఒకప్పుడు కైరోనగరంలో అబూ కాసిం అని ఒక మందులమ్మేవాడు ఉండేవాడు. వాడు చెప్పశక్యంగాని లోభి. తన వ్యాపారంలో బోలెడంత లాభం వస్తున్నప్పటికీ, డబ్బు ఖర్చు చెయ్యటం ఇష్టంలేక, బిచ్చగాళ్ళు కూడా ధరించని చింకిబట్టలు వేసుకునే వాడు. వాడి తలపాగా ఏనాటిదోగాని అది వెలిసిపోయి ఏరంగోకూడా తెలియరాకుండా పోయింది. అయితే వీటన్నిటికన్న ప్రసిద్ధి కెక్కినవి వాడి చెప్పులు. అవి బహుపురాతన మైనవి. ఎంతమంది చెప్పులు కుట్టేవాళ్ళు వాటిలో ఎన్నివందల మేకులు కొట్టారో, వాటికి ఎన్ని తోలుముక్కలు అతుకుపెట్టారో తెలీదు. ఏళ్ళ తరబడి మరమ్మతు పొంది అవి బరువెక్కాయి.

అబూకాసిం చెప్పులను జనం సామెతగా చెప్పుకునేవారు. బరువు మోసేవాళ్ళు, "అబ్బో, ఈ మూట అబూ కాసిం చెప్పులంత బరువుందే!" అనేవాళ్ళు అయాసపడుతూ. ఎవరికన్నా కడుపులో శూలవస్తే, "నేను తిన్న తిండి అబూకాసిం చెప్పుల్లాగా పని చేస్తోంది," అనేవాళ్లు.

ఒకనాడు అబూ కాసింకు వ్యాపారంలో మంచి లాటు దొరికింది. ఇతర వ్యాపారస్థులైతే సాటి వర్తకులను పిలిచి విందు చేస్తారు. కాని అబూ కాసింకు అలాటి అలవాట్లు లేవు. మంచి లాభం వచ్చినందుకు పండగచేసుకున్నట్టుగా స్నానశాలకు వెళ్ళి వద్దామనుకున్నాడు వాడు. ఎందుచేతనంటే వాడు స్నానశాల ముఖం చూసి ఎన్నో ఏళ్ళయింది. వాడు తన దుకాణం మూసేశాడు; తొడుక్కుంటే అరిగిపోతాయని చెప్పులను భుజాన వేసుకుని స్నానశాలకు వెళ్ళాడు. బయట అందరూ చెప్పులు విడిచిన చోట తన చెప్పులుకూడా విడిచి లోపలికి వెళ్ళాడు.

జి. సూర్యనారాయణ





అబూ కాసిం వంటినిండా మట్టి పేరి ఉండటంచేత స్నానాలు చేయించేవాళ్లు అతనికి చాలాపర్యాయాలు నలుగు పట్టించవలసివచ్చింది. అబూ కాసిం స్నానం పూర్తి చేసి బయటికి వచ్చేసరికి సూర్యాస్తమయమయింది. స్నానాలు చేసేవారంతా అసరికి వెళ్ళిపోయారు.

స్నానశాల బయట కాసింకు తన చెప్పులకు బదులు పచ్చని తోలుతో తయారు చేసిన సరికొత్త చెప్పులజత కనిపించింది. "ఇలాటి చెప్పులు కొందామని ఎన్నేళ్ళుగానో అనుకుంటున్నాను. ఆ సంగతి తెలిసి అల్లా వీటిని నాకు బహుమానంగా పంపినట్టున్నది! లేక ఎవరైనా పొరపాటున వీటికి బదులు నా చెప్పులు తొడుక్కుపోయారో!" అనుకుంటూ వాడు ఆ కొత్తచెప్పులను కాళ్ళకు తొడుక్కుని పరమానందంతో అక్కడినుండి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇంతకూ ఈ కొత్తచెప్పులు కాజీగారివి. ఆ సమయాన అయన స్నానశాలలోనే ఉన్నాడు. అయితే అబూ కాసింకు తన చెప్పులెందుకు కనబడలేదంటే, చెప్పులకు కాపలా ఉండేవాడు మిగిలిన చెప్పులమధ్య కాసిం చెప్పులు చూసి మండిపడి వాటిని ఒక మూలగా దాచిపెట్టాడు. అబూ కాసిం స్నానశాలనుంచి బయటికి రావటం చాలా ఆలశ్యం అయింది. ఈలోపల కాపలావాడు ఇంటికి పోయేవేళ కావటంచేత వాడు వెళ్ళిపోయాడు.

కాజీగారు స్నానం పూర్తిచేసి తన చెప్పుల కోసం అడిగాడు. స్నానశాల ఉద్యోగులు అంతటా వెతకగా అబూ కాసిం చెప్పులు మాత్రమే వారికి దొరికాయి. అవి లోక ప్రసిద్ధమైన చెప్పులు కావటంచేత వారు వాటిని పోల్చుకుని, అబూ కాసింను కొత్త చెప్పులతోసహా తీసుకువచ్చి కాజీగారి ఎదట పెట్టారు. కాజీ తన చెప్పులను తాను తీసుకుని అబూ కాసింను ఖైదులో పెట్టించాడు.



జైలు అధికారులకు పెద్ద ఎత్తున లంచం పెట్టి అబూ కాసిం బయటపడ్డాడు.

ఇంత జరిగాక అబూ కాసింకు తన చెప్పులమీద చాలా ఆగ్రహం వచ్చింది. వాడు వాటిని తీసుకుపోయి నైల్ నదిలో పారేసి వాటి పీడ వదిలించుకున్నాడు.

అయితే అవి అంత సులభంగా వదిలే చెప్పులు కావు. కొద్ది రోజుల అనంతరం కొందరు పల్లెవాళ్ళు నైల్ నదిలో చేపలు పట్టబోయి వల వేశారు. వలను లాగేటప్పుడు వారికి చాలా బరువు అనిపించింది. తీరా తీసి చూస్తే అందులో అబూ కాసిం చెప్పులున్నాయి. ఆ చెప్పుల మేకుల మూలాన వల తాళ్ళు చాలాచోట్ల తెగిపోయాయి. వారా చెప్పులను అబూ కాసిం దుకాణానికి తెచ్చి నానాతిట్లూ తిడుతూ వాటిని దుకాణంలోకి గిరవాటు వేశారు.

ఆ చెప్పులు తగలటంవల్ల అబూ కాసిం మందులసీసాలూ, అత్తరుసీసాలూ కొన్ని కిందపడి పగిలి చాలా నష్టం జరిగింది.

అబూ కాసిం దుఃఖం వర్ణనాతీతం. వాడా చెప్పులను నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టి, వాటిని తన దొడ్లోకి తీసుకుపోయి, పాతిపెట్టటానికిగాను గొయ్యి తవ్వాడు. అబూకాసిం పైన చాలాకాలంగా కసి ఉన్న పొరుగు వాడొకడు ఈ సంగతి కనిపెట్టి, నగరాధికారి



వద్దకు వెళ్ళి, "అబూకాసిం అధికారులకు తెలపకుండా తన దొడ్లో ఏదో నిధి తవ్వి తీసుకున్నాడు!" అని ఫిర్యాదు చేశాడు.

అబూకాసిం పరమలోభి అని అందరికీ తెలుసు గనక అధికారి ఈ ఫిర్యాదును నమ్మి వాణ్ణి పిలిపించాడు. "నేను నా చెప్పులను పాతెయ్యటానికి గొయ్యి తవ్వాను!" అని అబూ కాసిం ప్రమాణంచేసి చెప్పిన మీదట, పెద్ద లంచం తీసుకుని అధికారి వాణ్ణి వెళ్ళిపోనిచ్చాడు.

అబూకాసిం దుఃఖంలో తన గడ్డమంతా పీక్కున్నాడు. వాడా చెప్పులను తీసుకుని నగరందాటి దూరంగా వెళ్ళి ఒక కాలవలో పారేసి, ఇక అవి తనకంట పడవన్న ధైర్యంతో ఇంటికి తిరిగి వచ్చాడు. కాని ఆ కాలవ మీద ఒక మర ఉన్నది. కాసిం చెప్పులు కొట్టుకుపోయి ఆ మరతాలూకు యంత్రాల మధ్య చిక్కుకున్నాయి. మర కాస్తా ఆగిపోయింది. యంత్రాలు ఊడదీసి మరమ్మతు చేసేటప్పుడు చెప్పులు బయటికి వచ్చాయి. మర యజమాని వాటిని గుర్తించి అబూకాసిం మీద నష్టపరిహారంకోసం వ్యాజ్యం తెచ్చాడు. అబూ కాసిం పెద్ద ఎత్తున జరిమానా ఇచ్చుకోవలసివచ్చింది.

వాడికి మతి పోతున్నట్టయింది. ఆ పాపిష్టి చెప్పులను ఎలా వదిలించుకోవాలా అని ఆలో



చిన్తూ వాడు తన ఇంటి డాబామీదికి వెళ్ళి, చెప్పులను పిట్టగోడపై ఉంచి, తానా గోడపై అని ఆలోచనలో పడ్డాడు. ఇంతలో పక్క ఇంటి డాబామీద ఉన్న ఒక కుక్క అబూ కాసిం చెప్పులు చూసి, రెండు డాబాల మధ్యా ఉన్న అడుగోడ దూకి వచ్చి, ఆ చెప్పులను ఏదో చేయబోయింది. మరుక్షణం అవి పిట్టగోడమీదినుంచి వీధిలోకి పడ్డాయి. దురదృష్టవశాత్తూ ఆ సమయానికి అటుగా ఒక ముసలిది పోతున్నది. ఎంతో బరువైన కాసిం చెప్పులు దాని నెత్తిన పడి, అది కాస్తా అక్కడే ప్రాణం విడిచింది.

ఆ సమయంలో వీధిలో నడుస్తున్న ప్రజలు చాలామంది చచ్చిపోయిన ముసలి దానిచుట్టూ గుమిగూడి అబూ కాసింను తిట్టసాగారు. అంతలో అక్కడికి కొందరు రాజభటులు వచ్చి అబూ కాసింను పట్టుకుపోయి మళ్ళీ ఖైదులో పెట్టారు. చచ్చిపోయినదాని బంధువులకు పరిహారం చెల్లించి జైలు అధికారులకు అంతులేని డబ్బు లంచం పెట్టాక అబూ కాసిం ఖైదు నుంచి బయటపడ్డాడు.

ఇప్పటికి వాడికి జ్ఞానోదయం అయింది. మర్నాడు వాడు తన చెప్పులను తీసుకుని కాజీగారి వద్దకు వెళ్ళాడు. వాడు వాటిని ఆయన ముందుపెట్టి, "మహాప్రభూ, ఈ దిక్కుమాలిన చెప్పులు నా కొంప గుండం చేశాయి! వీటి మూలాన నేను బికారినై పోయాను. నేను తమకు విన్నవించుకునే దేమంటే ఇవాళనుంచీ నాకు చెప్పులనేవి లేవు. ఏ చెప్పులవల్లగాని ఎవరికిగాని ఇక ముందు నష్టం జరిగేపక్షాన నేను దానికి జవాబుదారును కాను. ఈ సంగతి తమరు చట్టరీత్యా గుర్తించగలందులకు ప్రార్థిస్తున్నాను!" అని ఎలుగెత్తి చెప్పాడు.

న్యాయస్థానంలో ఉన్న మిగిలిన అందరి తోబాటు కాజీగారుకూడా ఈ మాటలకు విరగబడి నవ్వాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 డిసెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ. మద్రాసు-26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నేలకు జారే దొకరైతే...

రెండవ ఫోటో : నింగిని తాకే దింకొకరు

పంపినవారు : వడ్లమాని హనుమాయమ్మ,

C/o వడ్లమాని రామం, బి. ఎస్.సి., పోస్టల్ అఫీషియల్, అమలాపురం (తూర్పు గోదావరి జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్' ను వెంటబెట్టుకుని తోటలోనుంచి వెళుతూవుండగా, హఠాత్తుగా ఒక చెట్టుకొమ్మమీదనుంచి పెద్ద జంగుపిల్లి వాళ్ళ మీదికి దూకబోయింది. దాసూ, వాసూలు తారెత్తి వెనక్కు పారిపోసాగారు. కాని, 'టైగర్' కు పిల్లులంటే తగని కోపం. అది పెద్దగా మొరిగి ఒక్క దూకున ఆ జంగుపిల్లి మెడ పట్టుకున్నది. ఆ వెంటనే ఠపీమంటూ జంగుపిల్లి పేలిపోయింది. అది రబ్బరుపిల్లి అని తెలుసుకుని, దాసూ వాసూలు వెనుదిరిగేసరికి, దానిని దారంతోకట్టి చెట్టుకొమ్మల్లో నుంచి వాళ్ళమీదకు వదిలిన కొంటెకుర్రాడు ఏడుపుముఖంపెట్టి చెట్టుచాటునుంచి దూరంగా పరిగెత్తాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'


Kashmir


Kashmir






PERMANENT
ROYAL BLUE
Iris
FOUNTAIN PEN INK
RECHLAB'S
Iris
INK


PERMANENT
ROYAL BLU
FOUNTAIN
RECHLAB'S
Iris
FOUNTAIN PEN INK




Iris
ROYAL BLUE
RECHLAB'S
Iris
INK



# నేడే కొనండి!

మా చందమామ పాఠకులకు —

మంచి పుస్తకాలపై మీరు చూపిన ఆసక్తి మాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. అపారమైన మా మంచిపుస్తకాలలో అతి చురుకుగా అమ్ముడు పోతున్న మూడు పుస్తకాలను మీ కిప్పుడు పరిచయం చేస్తున్నాం.




సత్య సంపన్నుల జ్ఞాన ధనాన్ని సులభ సుంద రంగా అందించే ముచ్చటైన కట్టుకథలు.

రు. 1=50



మధ్యతరగతి గృహస్థుల జీవితాన్ని చిత్రిస్తూ బుచ్చిబాబు రచించిన ప్రసిద్ధ నవలకు సంక్షిప్త సంపుటం

రు. 2=75




వంట ఇంటిని చక్కగా అమర్చుకొని, వంటలను, పిండివంటలను హితవుగా వండుకో దలచిన ప్రతి గృహిణికి ఉపకరించే గ్రంథం.

రు. 1=25

## ఇంటింటికీ గ్రంథాలయం

ఉత్తమ గ్రంథాలు: అతి స్వల్పవెలలు

కుటుంబంలో ప్రతివారికీ కోరుకున్న పుస్తకం దొరుకుతుంది.

శుభసమయాలలో బహూకరించటానికి తగిన కానుకలు పుస్తకాలే!

కేటలాగ్ ఉచితం.

మీ వూరి పుస్తక విక్రేతను అడగండి. లేదా, సరాసరి మాకే వ్రాయండి:

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

6549/4, రాష్ట్రపతి రోడ్ - సికింద్రాబాద్

"నీ పరీక్ష మార్కులు ఎన్నదగినంత ఎక్కువగా లేవు, కాంతా, కాని నీ బడి దుస్తులు, **టినోపాల్** వల్ల ఎల్లప్పుడూ మెరిసే తెల్లగా వుంటున్నవి గనుక, నీవు ప్యాస్ చేయబడ్డావు."




"టినోపాల్" జె.ఆర్. గెయిగి.ఎస్.ఎ., బాల్, స్విట్జర్లాండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

నిర్మించిన వారు : సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు : సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి.ఒ. బాక్స్ నం 965 బొంబాయి.

కొద్దిగా టినోపాల్ తెల్ల బట్టలను అన్నిటికన్నా అతి తెల్లగా జేయును.

SISTA'S-SG-44-TEL

అక్టోబరు విడుదల...





అనుపమ
చిత్రం..

# అత్తా ఒకింటి కోడలే!..







నిర్మాత • దర్శకుడు • తిలక్

పూర్ణా రిలీజ్






సంధ్య చీకటివేళ స్నేహితులు
కలుసుకొని, ఊసుపోకకు
మాట్లాడుకుంటూ, అనేక విషయాలపై
వాదోపవాదాలకు దిగుతారు. కాని,
వారెప్పుడూ ఉత్తేజం కలిగించ
గల ఒక కప్పు టీ సేవిస్తునే వుంటారు!



## నేను టీని

స్నేహితులు కలుసుకున్నప్పుడు
నేను కూడా వారితో చేరుతాను

PST 211

Photo by K. K. Nair



బహుమతి
పొందిన వ్యాఖ్య

నింగిని తాకే దింకొకరు

పంపినవారు :
వి. హనుమాయమ్మ - అమలాపురం

